# బమ్మెర పోతరాజు చరిత్రము

వద్దూరి శ్రీరామమూర్తి



రెండవకూర్పు 500 ప్రతులు

పబ్లిషర్సు :

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

1944

 [ వెల రు 0–8–0

# స్తుతిపద్యములు.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

క. శ్రీకంఠ చాపఖండన
పాకారిప్రముఖవినుత భండన విలస
త్కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల రామనృపాలా.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు సోకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికి జంచరీకచయ సుందర వేణికి రక్షితామర
శ్రేణికి దోయజాతభవ చిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామశుక వారిజపుస్తక రమ్యపాణికిన్.

శా. తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతం బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా.

# విషయసూచిక

# బమ్మెర పోతరాజు చరిత్రము.



## బమ్మెర పోతరాజ కవి.

హిందూజనంబుల కెల్ల పవిత్రగ్రంథములు మూడు. (1) శ్రీమద్రామాయణము. (2) భాగవతము. (3) భారతము. ఈమూడుగ్రంథములును సమగ్రముగా నొక్కకవివర్యునిచే రచింపఁబడి యుండలేదు. రామాయణము, భాగవతము, ఈరెండును దొలుత నొక్కరిచే రచింపబడినను కాలక్రమమున నందలిభాగములు నశింపగా నితరులు వానిని పూరించిరి. కాన భారతము సమగ్రముగా నొక్కనిచే రచింపబడి యుండలేదు.

భాస్కరరామాయణము:—ఇద్దానిని దొలుత భాస్కరుడు రచించెను.

బాలకాండము:—భాస్కరామాత్యపుత్ర మల్లిఖార్జున భట్ట ప్రణీతము.

అయోధ్యాకాండము:—నిశ్శంక వీరమారయకుమార రుద్రదేవ ప్రణీతము.

అరణ్యకాండము:—భాస్కర ప్రణీతము.

కిష్కింధాకాండము:—మల్లిఖార్జునభట్ట ప్రణీతము.

సుందరకాండము:—మల్లిఖార్జునభట్ట ప్రణీతము.

యుద్ధకాండము:—అయ్యలార్య ప్రణీతము.

2. భాగవతము:—భాగవతమును సమగ్రముగా నాంధ్రమున రచించినవాఁడు బమ్మెర పోతనామాత్యుఁడు. ఈతఁడు రచించినగ్రంథములోని భాగములు నశింపగా నీతనిశిష్యులగు సింగరాజు, వెలిగందల నారాయణ మున్నగువారలు నశించిన భాగములను రచించియుండిరి.

3. భారతము:— ఆదిసభాపర్వములును, అరణ్యపర్వములోని కొంతభాగమును నన్నయభట్టు రచించెను. ఈతఁడు అరణ్యపర్వమును రచించుచుండగా వేములవాడ భీమకవి శాపవశమున మరణించెనను ప్రతీతిగలదు. *

* వేములవాడ భీమకవి శాపమును గూర్చిన కథ:— వేములవాడ భీమకవి తన పాండిత్య పరీక్ష నంతయును జూపి రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్య మొకదానిని రచించియుండెను. భీమకవి తన కావ్యమును దొడ్డదొడ్డ నన్నయభట్టున కొసంగి ఈగ్రంథమును తమరు చిత్తగించినయనంతరము రాజరాజనరేంద్రునకు జూపి యాతనివలన నాకేమైన పారితోషిక మిప్పింపవలయునని ప్రార్థించెను. నన్నయ యా గ్రంథమును గైకొని చదివి యది తానిప్పుడు రచించుచున్న భారతముకంటె మిన్నగ నుండుటకెంతయు వింతపడి ఆహా! ఈకావ్యమును భూపాలునకు జూపితినా యాతడు పండితుండగుటచే నీగ్రంథము నెక్కుడుగా గౌరవింపక మానడు. మఱియు రేపటినుండియును నన్నుగూడ నిట్టి ద్వ్యర్థికావ్యములనే రచింపవలసినదని నియమించును. అందువలన నేను విశేషముగా శ్రమపడవలయును. కొంత స్వయముగా నిట్టిక్లిష్టములను నేనే తెచ్చుకొనవలయును అని వితర్కించుకొని యాగ్రంథమును భూపాలునకు జూపకుండెను. భీమనయు ననుదినంబున వరుదెంచి నాగ్రంథమును భూపాలునకు జూపితివా యని యడుగుచుండువాఁడు. అట్లడుగునప్పుడెల్ల నన్నయ తీరిక తప్పక రాజునకు గ్రంథము జూపెదను. ఇన్నిదినంబులవరకు అతనికి నావకాశముగా నాతో మాటలాడుటకు గూడ దీరికలేకుండెను. అని యప్పటికేదో వచించి పంపివేయుచుండువాడు. మఱికొన్నదినము లేగినపిమ్మట, భీమనగ్రంథమును నన్నయ నాశనము గావించెను. అది గుర్తెఱిఁగి భీమన యాతని గృహమునకు నరుదెంచి యప్పటి వాలుకు చదువుచున్న యాంధ్రశబ్దచింతామణిని గైకొని యద్దానిని గోదావరిలో పారవైచి మరల నన్నయగృహమున కరుదెంచి యాతనికుమార్తెను బిలిచి మీనాయనయిపుడు నేమి చేయుచున్నాడని ప్రశ్నించెను ఆమెయును నాజనకుడరణ్యపర్వము రచించుచున్నాడని చెప్పెను. అంత భీమకవి, కానిమ్ము ఇంకతఁ డరణ్యములోనె యుండును లెమ్ము అని తిట్టి వెడలిపోయెను.

భీమన శపించిన కొలదికాలమునకే యరణ్యపర్వమును పూర్తిచేయకుండగనే నన్నయ మరణించెను. భీమనశాపమునకు భీతిల్లియే కాబోలును తిక్కనసోమయాజి యరణ్యపర్వశేషము నట్టె విడచిపెట్టి తక్కిన 15 పర్వములు నాంధ్రీకరించెను.

ఈకథ నప్పకవి తన యప్పకవీయములో నుదాహరించియున్నాడు.

నన్నయభట్టునకు పిమ్మట తిక్కన సోమయాజి యరణ్యపర్వము ను పూరింపక విడచిపెట్టి విరాటపర్వమునుండి భారతము సమగ్రముగా 15 పర్వములను రచించెను.

తిక్కన సోమయాజికిపిమ్మట నెఱ్ఱాప్రెగ్గడ యరణ్యపర్వశేషమును రచించెను. కాని యెఱ్ఱాప్రెగడ నన్నయవిడచినభాగమును పూరించుచు షష్ఠ్యంతములను జెప్పియుండలేదు ఇంతమాత్రమేగాక యారణ్యపర్వ శేషమునకుగూడ రాజరాజనరేంద్రునే కృతిభర్తగానుంచెను. ఇట్లు గావించుటకు వేములవాడ భీమకవిశాపమే కారణమని పెక్కురు వచింతురు. ఇయ్యది సత్యముగునోకాదో నిర్ణయించుటకాధారములు గాన్పింపవు.

## పోతన-వంశాభివర్ణనము.

పోతన భాగవతమున దనవంశము వారల నిట్లభివర్ణించియున్నాడు.

సీ. కౌండిన్యగోత్రసం ♦ కలితుం డాపస్తంబ
సూత్రుండు పుణ్యుండు ♦ సుభగుఁడైన
భీమనమంత్రికి ♦ ప్రియపుత్రు డన్నయ్య
కలకంఠి తద్భార్య ♦ గౌరమాంబ
కమలాప్తువరమునఁ ♦ గనియె సోమనమంత్రి
వల్లభ మల్లమ ♦ వారితనయు
డెల్లనయతనికి ♦ నిల్లాలుమాచమ
వారిపుత్రుఁడు వంశ ♦ వర్ధనుండు
లలితమూర్తి బహుక ♦ ళానిధి కేసన
దానమాననీతి ♦ ధనుఁడు ఘనుఁడు
దనకు లక్కమాంబ ♦ ధర్మగేహినిగాఁగ
మనియె శైవశాస్త్ర ♦ మతముగనియె.

క. నడవదు నిలయము వెలువడి
తడవదు పరపురుషగుణము ♦ దనపతినుడువుం
గడవదు వితరణకరుణలు
విడువదు లక్కాంబవిబుధ ♦ విసరము బొగడన్.

ఉ. మానినిలీమగారు బహు ♦ మానని వారితదీనమానస
గ్లానికి దానధర్మమతి ♦ గౌరవమంజులతాగభీరతా
స్థానికి ముగ్ధసానికి ♦ సదాశివపాదయుగార్చనాను కం
పానయవాగ్భవానికిని ♦ బమ్మెరకేసయ లక్క-సానికిన్.

క. ఆమానినికిం బుట్టితి
మేటిరుపురమగ్రజాతుఁ ♦ డీశ్వరుసేవా
కాముఁడు తిప్పన పోతన
నామవ్యక్తుండసాధు ♦ నయయుక్తుండన్.

ఈతడు భాగవతగద్యయం దిట్లువ్రాసియున్నాఁడు.

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన.

ఇట్లు వ్రాయుటచేత నీతఁడు స్వయంకృషిచేతనే విద్యాధనమును సంపాదించియున్నాఁడని మనము తలంపవలసివచ్చుచున్నది. మఱియు పరమేశ్వరకరుణాకలితుండనికూడ చెప్పుకొనియున్నాఁడు. కాని వీరభద్రవిజయములోనిగద్యయు భాగవతగద్యవలెనుండక వేరువిధముగా నుండుట గమనించవలసియున్నది.

వీరభద్రవిజయములోనిగద్యము: ఇది శ్రీమన్మహామహేశ్వర యివటూరి సోమనారాధ్యదివ్యప్రసాద పాదపద్మారాధక కేసనామాత్య పుత్ర పోతయనామధేయప్రణీతంబయిన వీరభద్రవిజయంబు.

ఇట్లు భిన్నముగా ఆశ్వాసాంతగద్యముండుటకు కారణముగప డదు. తొల్లిటిపుస్తకమునకు భాగవతమును రచించునెడల గల సహజ పాండిత్యబిరుదము వీరభద్రవిజయములోని గద్యలో లేకుండుట ఆలో చన కవకాశ మిచ్చుచున్నది. మఱియు వీరభద్రవిజయములోగల యివ టూరి సోమనారాధ్య ప్రశంస భాగవతమునందెచ్చటను గానరాదు. ఈ కారణములవలన వీరభద్రవిజయమితని కృతియగునా కాదాయని సందేహింపవలసి వచ్చుచున్నది.

వీరభద్రవిజయములో భాగవతమునందలి శయ్యాసౌభాగ్యము లంతగా కానరావు. పోతనభాగవతమునం దెచ్చటజూచినను విచ్చ

లవిడిగా ప్రయోగించిన అంత్యప్రాసముగల యలంకారము గానరాదు. మఱియు భాగవతమునందు లేనట్టి దోషములు పెక్కులుగా వీరభద్రవిజయమునంగలవు. ఇందువలన నీతఁడు వీరభద్రవిజయమును భాగవతమునకంటె ముందుగా రచించియుండునని యనుకొనవలసియున్నది. కాని భాగవతమును రచించుటలో శివదూషణఁజేయుటచే నతనికి నేత్రావరోధము కలిగినట్టును అందులకై యాతఁడు బంధుజనప్రేరితుఁడై వీరభద్రవిజయము రచింపసమకట్టెనని అనుశ్రుతముగా వచ్చుకథలవలన తెలియవచ్చుచున్నది. ఇందుకనుగుణ్యముగా వీరభద్రవిజయములో,

ఉ. భాగవతప్రబంధ మతి ♦ భాసురతన్ రచియించి దక్షుదు
ర్యాగ కథాప్రసంగమున ♦ నల్పవచస్కుఁడనైతి దన్నిమి
త్తాగతవక్త్రదోషపరి ♦ హారముకై యజనైకశైవశా
స్త్రాగమ వీరభద్రవిజ ♦ యంబు రచించెద వేడ్కనామదిన్.

భాగవతమునందు పోతన గావించిన శివదూషణ,శివభక్తాగ్రేసర దూషణ మొదలైనవి,

సీ. అనయంబులు ప్రక్రి ♦ యాకలాపుడుమాన
హీనుడు మర్యాద ♦ లేనివాడు
మత్తప్రచారుఁడు ♦ న్మత్తప్రియుడు దిగం
బరుడు భూతప్రేత ♦ పరివృతుండు
దామసప్రమథ భూ ♦ తములకు నాథుండు
భూతిలిప్తుండస్థి ♦ భూషణుండు
నష్టశౌచుండు ను ♦ న్మదనాథుడును దుష్ట
హృదయుడుగ్రుడును బ ♦ రేతభూని
కేతనుడు వితతవిస్రస్త ♦ కేశుడశుచి
యయినయితనికి శివనాము ♦ డను ప్రవాద
మెటులగలిగె నశివుడగు ని ♦ తనికి నెఱిగి
యెఱిగి వేదంబు శూద్రున ♦ కిచ్చినటుల.

తే. గీ. వసుధనెవ్వారు ధూర్జటి ♦ వ్రతులువారు
వారి కనుకూలురగుదురె ♦ వ్వారు వారు

నట్టిసచ్ఛాస్త్ర పరిపంథు ♦ లైనవాఁ
నవనిపాషండులయ్యెద ♦ రని శపించె.

ఇది యిట్లుండగా భోగినీదండకము యొక్క అంత్యమునందీ క్రింది పద్యము కానవచ్చుచున్నది.

ఉ. పండితభర్తనీయుడగు ♦ బమ్మెరపోతన యాసుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి ♦ తారకమై విలసిల్లభోగినీ
దండకమున్ రచించె బహు ♦ దాన విహారకురావుసింగ భూ
మండలభర్తకున్ పమత ♦ మానవనాథమదాపహర్తకున్.

## పోతన జననకాల నిర్ణయము.

ఈతఁడు భాగవతమును రచించినపిమ్మట రచించిన భోగినీదండకమును సర్వజ్ఞసింగమనాయున కంకితము గావించియుండెను. సర్వజ్ఞసింగమనాయుఁడు 15 వ శతాబ్దముయొక్క మొదటనుండినవాడగుటచే నీతడును ఆకాలముననే యుండెనని తలంపవలసి వచ్చుచున్నది.

మఱియు వీరభద్రవిజయమున బేర్కొన్న యివటూరి సోమనారాధ్యులవారుగూడ ప్రౌఢదేవరాయులకాలములో నుండియుండుటచే నీతఁడుగూడ ప్రౌఢదేవరాయుల కాలములోనివాడని తలంపవలసివచ్చుచున్నది.

శ్రీనాథునకును యీతనికి బాంధవ్యమున్నట్టు లనుశ్రుతముగా వచ్చు కథలవలన దెలియుచున్నది. కావున శ్రీనాథునకీతఁడు సమకాలీనుఁడని చెప్పవలయును.

పదునాల్గవ శతాబ్దముయొక్క అంత్యమున నీతడు జనించి యించుమించుగా పదునేనవ శతాబ్దముయొక్క మధ్యవరకును జీవించి యుండెననుట సత్యమునకు సమీపము గావచ్చును.

## పోతన నికేతనము

ఈతఁడు తననివాస మేకశిలానగరమని భాగవతమున నిట్లుజెప్పి యున్నాఁడు.

“వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణ పారిజాతపాదపసమా
శ్రయంబునను హరికరుణావిశేషంబునను గృతార్థుంబు సిద్ధించెనని

బుద్ధినెఱింగి తెచ్చి మరలి కొన్నిదినంబులకు నేకశిలానగరంబునకు జనుదెంచి యందు గురువృద్ధబంధుజనానుజ్ఞాతుండనై,"

ఏకశిలానగర మిపుడెక్కడను గానరాదు. ఏకశిలయన నొంటిమెట్టయని కొందరును, ఓరుగల్లు అని కొందరును యర్థములనుదీసి తమ తమ వాదములను స్థిరపరచుకొని దీర్ఘములగు నుపన్యాసముల నిచ్చియున్నారు. ఆవిషయములను గూర్చి చర్చించుటకిందు తావు చాలమిని విడువవలసి వచ్చినది.

## పోతనామాత్యుని వాక్సిద్ధి

పోతనామాత్యుండు కల్గనదియెల్ల నిక్కమగుచుండుననుటజన ప్రసిద్ధముగానున్నది. అందులకీ క్రిందికథ యుదాహరణమని వచింతురు.

శ్రీకృష్ణుండు మహానుభావుండు గావున బ్రాహ్మణకుమారుండు మృతిజెంద దుఃఖించుచుండగా నక్కుమారుని సజీవితుం జేసెనని వ్రాయుచుండగా పోతన కుమారులలో నొక్కడు మరణించుటయు మరల జీవించుటయు గల్గెను.

రుక్మిణీకల్యాణమున రుక్మిణీదేవిని వర్ణించుచు నీక్రిందిపద్యమును రచించునెడ.

సీ. దేవకీసుతుకోర్కె ♦ తీవలు వీడంగ
వెలదికి మైదీవ ♦ వీడఁబోడఁగఁ
గమలనాభుని చిత్త ♦ కమలంబు వికసింపఁ
గాంతినింతికి ముఖ ♦ కమలమొప్పె
మధువిరోధికి లోన ♦ మదనాగ్ని పొడసూపఁ
బాలతికిఁ జనుదోయి ♦ బొడవు సూపె.
శౌరికి ధైర్యంబు ♦ సన్నమై డాయంగ
జలజాక్షి మధ్యంబు ♦ సన్నమయ్యె
హరికి బ్రేమబంధ ♦ మధికంబుగాఁ గేశ
బంధ మధికమగుచు ♦ బాలకమరె

యని వ్రాయునంతి కుయ్యాలతొట్టి బరుండి నిద్రించుచున్న యాతనిబాలిక దొట్ల క్రిందనున్న కుంపటిలోబడి కమురి వాసన వేయ నారంభించెను. అంతట పోతన్న

పద్మాసయనువలన ♦ బ్రమదంబు నిండారె
నెలత యౌవన బు ♦ నిండియుండె

యని పద్యమును పూర్తిగావించునప్పటికి యాబాలిక కుంపటి నుండి లేచి సుఖముగా నుండెను.

ఇట్టివిషయము లనేకముల నుదాహరింపవచ్చును గాని యివి సత్యమునకు దూరమైయుండునని యీకాలమున తలంపకపోరు. ఇవి యాతనియందుగల గౌరవముచేతను, యాతనికూలంకషప్రజ్ఞ చాటుటకును కల్పితములై యుండును.

---

## పోతనకు సరస్వతీదేవి ప్రత్యక్షమగుట.

పోతన భాగవతమును రచించుచుండగా నొకనాడు శ్రీనాథుడరుదెంచి హాలికులకు గుశలమాయని పరియాచకమునకై బల్కెను. అంత పోతరాజు.

ఉ. బాలరసాలసాల నవ ♦ పల్లవకోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపుఁ ♦ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహ ♦ నాంతరసీమలకందమూలకౌ
ద్దాలికులైననేమి నిజ ♦ దారసుతోదరపోషణార్థమై.

అని యుత్తరువొసంగెను. శ్రీనాథుఁడంతసిగ్గువడి బావా! పరిహాసమున కట్లంటిని. ఇంతలోననే కోపింపవలయునా! అని కొంతతడ విష్టాగోష్ఠియందు గడపెను.

నాటినుండి నాలుగైదు దినంబులు శ్రీనాథుఁడు పోతనతో బావా! పాపమో పుణ్యమో! యెవ్వరుచూచినారు. ఈకుటుంబమును పోషించుకొనిన పిమ్మటగదా పరమసంగతి యాలోచించుకొనవలయును. దారిద్ర్యముకంటె నీచమేమియును లేదుగదాయని బలుకుచు నాతనిమది ద్రిప్పబోయెను.

శ్రీనాథుఁడు వెడలిపోయినపిమ్మట పోతన యొకనాడింటియందు బియ్యము మున్నగునవేమియు లేకుండుటచే మిగుల వ్యసనపడి

కట్టా! ఎన్నిదినములు నే నుపవసింతును. నే నెట్లో యేజలాహారముతో డనో నిలువగలను గాని యాలుబిడ్డలమాట యేమి, ఏమైనను సరే గ్రంథము నెవ్వరికైన నంకితమిచ్చి ధనంబును గొనియెదనుగాక యని నిశ్చయించుకొని భాగవతము ను చంకబెట్టి యుత్తరీయమును కప్పికొని వీధిలోని కరుదెంచెను. తోడనే యాతనికట్టెమట వలవల కన్నీరు గార్చుచు విలపించు సరస్వతీదేవి ప్రత్యక్షమయ్యెను. ఆమెను గాంచి నంతనే పోతనమది కరిగిపోయెను. అంతనాతఁడు సరస్వతి నుద్దేశించి యిట్లనియెను.

ఉ. కాటుకకంటినీరు చను ♦ కట్టుపయింబడ నేలయేడ్చెదో
కైటభదైత్యమర్దనుని ♦ గాదిలికోడల! యోమదంబ! యో
హాటకగర్భురాణి నిను ♦ నాకటికింగొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల ♦ కమ్మ త్రిశుద్ధిగనమ్మ భారతీ!

భాగవత కృతిపతిత్వ నిర్ణయము.

పోతనామాత్యు డొకయుద్గ్రంథమును రచింపకోరి యొక్కొరా కానిశాకాలంబున సోమోపరాగంబు రాకంగని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్రసముత్తుంగభంగయగు గంగకుంజని క్రుంకులిడి వెడలి మహానియమంబున పులినతలమంటపమధ్యంబున మహేశ్వరధ్యానంబు సేసి కించిదున్మీలితనేత్రుండనై యున్నయెడ,

సీ. మెఱుఁగు చెంగటనున్న ♦ మేఘంబుకైవడి
నువిద చెంగటనుండ ♦ నొప్పువాడు
చంద్రమండలసుధా ♦ సారంబుపోలిక
ముఖమున జిరునవ్వు ♦ మొలచువాడు
వల్లీయుతతమాల ♦ వసుమతీజముభంగి
బలువిల్లుమూపున ♦ బరగువాడు
నీలనగాగ్ర స ♦ న్నిహితభానునిభంగి
ఘనకిరీటముదల ♦ గలుగువాడు

ఆ. పుండరీకయుగము ♦ బోలుకన్నులవాడు
వెడదయురమువాడు ♦ విపులభద్ర

మూర్తి వాడు రాజ ♦ ముఖ్యశేఖరుండు నా
కన్నుగవకు నెదుర ♦ గానఁబడియె.

వ. ఏను నారాజశేఖరుం దేఱఁజూచి భాషింప యత్నంబుసేయు నెడ నతండు దా రామభద్రుండ, మన్నామాంకితముగా శ్రీమహాభాగవతంబు దెనుంగుసేయుము, నీకు భవబంధములు దెగునని యానతిచ్చి తిరోహితుం డయిన సమున్మీలితనయనుండనై వెఱఁగుపడి చిత్తంబున,

క. పలికెడిది భాగవతమట
పలికించువిభుండు రామ ♦ భద్రుండట నే
బలికిన భవహరమగునట
పలికెద వేఱొండుగాథ ♦ పలుకఁగ నేలా.

అని పరమేశ్వరునకు కృతినీయఁదలంచి,

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల ♦ కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని ♦ చొక్కి , శరీరమువాసి, కాలుచే
సమ్మెటవాటులం బడక ♦ సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు ♦ భాగవతంబు జగద్ధితంబుగన్.

అని వక్కాణించి కృత్యాదిని,

శా. శ్రీకైవల్యపదంబు జేరుటకునై ♦ చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళా ♦ సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు కేళిలోలవిలస ♦ ద్దృగ్జాలసంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహా ♦ నందాంగనాడింభకున్.

అని శ్రీకృష్ణభగవానుని సంస్తుతించియున్నాడు. కాని స్కంధాంతపద్యంబులందానను, తక్కిన స్కంధాదులయందును శ్రీరాముని సంబోధించియున్నాడు.

ఉదాహరణలు.

అనుపమగుణహారా ♦ హన్యమానారివీరా
జనపితతవిహారా ♦ జానకీచిత్తచోరా
దనుజఘనసమీరా ♦ దానవశ్రీవిదారా
ఘనకలుషకఠోరా ♦ కంధిగర్వాపహారా.

ద్వితీయస్కంధము ఆదిపద్యము.

క. శ్రీమద్భక్తచకోరక
సోమ విశేషాభిరామ ♦ సుగవినుతగుణ
స్తోమ నిగల కృతాసుర
రామాసీమంతసీమ ♦ రాజీవరామా.

సప్తమస్కంధాదిపద్యము.

క. శ్రీమద్విఖ్యాతిలతా
క్రామితగోత్రోంతరాళ ♦ కమనీయమహా
జీమూతతులితదేహ
శ్యామలరుచిజాల రామ ♦ చంద్రకృపాలా.

సప్తమస్కంధాంత పద్యములు.

క. రాజీవసదృశలోచన
రాజీవభవాదిదేవ ♦ రాజవినుత వి
భ్రాజితకీర్తిలతావృత
రాజీవభవాండభాండ ♦ రఘుకులతిలకా.

మాలిని. ధరణిదుహితృరంతా ♦ ధర్మమార్గానుగంతా
నిరుపమనయవంతా ♦ నిర్జరారాతిహంతా
గురుబుధసుఖకర్తా ♦ కుంభినీచక్రభర్తా
సురభయపరిహర్తా ♦ సూరిచేతోవిహర్తా.

ఇట్లు శ్రీరామపరముగా గ్రంథమును రచియించుచు షష్ఠ్యంతములను శ్రీకృష్ణపరముగానే చెప్పియున్నాడు.

ఉ. హారికి నందగోకుల వి ♦ హారికి చక్రసమీరదైత్య సం
హారికి భక్తదుఃఖపరి ♦ హారికి గోపనితంబినీ మనో
హారికి దుష్టసంపదప ♦ హారికి ఘోషకుటీపయోఘృతా
హారికి బాలకగ్రహమ ♦ హాసురదుర్వనితాపహారికిన్.

ఉ. శీలికి నీతిశాలికి వ ♦ శీకృతశూలికి బాణహస్తని
ర్మూలికి ఘోరనీరద వి ♦ ముక్త శిలాహతగోపగోపికా
పాలికి వర్ణధర్మపరి ♦ పాలికి నర్జునభూజయుగ్మ సం
చాలికి మాలికిన్ విపుల ♦ చక్రనిరుద్ధమరీచిమాలికిన్.

ఉ. క్షుంతకు గాళియోరగవి ♦ శాలఫణావళిన ర్తనక్రియా
రంతకు నుల్లసన్మగధ ♦ రాజచతుర్విధఘోరవాహినీ
హంతకు నింద్రనందన ని ♦ యంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియ స ♦ మంచితభక్త జనానుగంతకున్.

ఉ. న్యాయికి భూసురేంద్రమృత ♦ నందనదాయికి రుక్మిణీ మన
స్థాయికి భూతసమ్మదవి ♦ ధాయికి సాధుజనానురాగసం
ధాయికి పీతవస్త్రరుచి ♦ ధాయికి పద్మభవాండభాండని
ర్మాయికి గోపికానివహ ♦ మందిరయాయికి శేషశాయికిన్.

పై పద్యములను బట్టియు, స్కంధాదిపద్యములను బట్టియు నీతడు రామకృష్ణులయవతారములయెడ నభేదబుద్ధిగల్గి యిరువురును నొక్కరేయని దలంచువాడనుట తెల్లమగుచున్నది.

అయినను ఈతఁడద్వైతియగుటచే భాగవతమును అద్వైతపరముగనే రచించియున్నాఁడు గాని విశిష్టాద్వైతపరముగ నాంధ్రీకరించియుండలేదు.

---

పోతనకు మహావిష్ణువు గ్రంథరచనయందు తోడ్పడుట.

పోతన మహాభాగవతమున నష్టమస్కంధమును ఆంధ్రీకరించుచు గజేంద్రమోక్షకథాసందర్భమున,

మ. అలవైకుంఠపురంబులో నగరిలో ........

అనునంతవరకును పద్యమును వ్రాసి యాపై నేమి వ్రాయుటకును దోపక బెద్దయుంబ్రొద్దు చింతించి యానాటికింక గ్రంథరచన పొసగదని కట్టిపెట్టి కుమార్తెను బిలచి అమ్మా! పుస్తకమును గొనిపోయి జాగ్రత్తపరుపుము అనిచెప్పి యటనుండిలేచి యాహ్నికముల దీర్చికొనుటకు నరిగెను.

భక్తవత్సలుడును కరుణాంతరంగుండును అగు శ్రీమహావిష్ణువు తన భక్తుడగుపోతన తనయానతిచే భాగవతమును దెనిగించుచు నాలోచన కుదురక గ్రంథరచనముగించి స్నానార్థమరిగినతోడనే యాతనికి దోడ్పడనెంచెను. తోడనే యాతఁడు పోతనరూపమును ధరించి యింటి

లోనికరుదెంచి కుమార్తెను బిలిచి అమ్మా! ఇందాకటి పుస్తకమును గంటమును గొనితెమ్మా, పద్యమును సంపూర్తిగావించెదను. అని వచించెను. పోతనకుమార్తె నిక్కముగనతని తండ్రియే మరలివచ్చి యిట్లడుగుచున్నాడని తలంచి యాపుస్తకమును గొనివచ్చి యిచ్చెను. మహావిష్ణువా గ్రంథమున పోతనవిడచిన పాదమును యిట్లు పూరించెను.

మ. అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదాపల,

అనిమాత్రము వ్రాసి యటుపిమ్మట పోతన సులభముగా నా పద్యమును పూరింపగలడని యెంచి పుస్తకమును యెప్పటియట్లు కట్టి పోతనకుమార్తెకిచ్చి వెలికేగెను. ఆబాలికయు గ్రంథమునుగొని జాగ్రత్తపరచెను.

పోతన యాదినమంతయును నాపద్యమునుగూర్చియే యాలోచించుచు గడిపివైచి మరునాడు ప్రాతఃకాలమున కుమార్తెనంపించి కుమారీ! పుస్తకమును గొనితెమ్మా. ఎట్లో యద్దానిని పూర్తిచేసెదను అని పల్కెను. కుమార్తె పుస్తకమును గొనివచ్చి యందించెను. పోతన గ్రంథమును విప్పిచూడగా నందు దన వ్రాతగాక ముత్యములకోవవలె వ్రాయబడియున్న వ్రాతను దిలకించి, యాపద్యము తానువ్రాసిన దానికంటె నెక్కుడుగా నుండుటయుగాంచి కుమార్తెను పిలిచి అమ్మా! ఇది వ్రాసినవారెవ్వరు చెప్పుమని ప్రశ్నించెను. అంత నామె జనకా! నిన్న మీరు స్నానమునకేగిన కొన్నినిముషములకు దిరిగివచ్చి నాచే పుస్తకమును దెప్పించి వ్రాసియుండిరికాదా ఇపుడిది యెవ్వరు వ్రాసిరని యడిగెదరేలయని ప్రశ్నించెను. అంత పోతన, నిన్న నేను పుస్తకము మరల ముట్టుకొనలేదు. ఆమహావిష్ణువేవచ్చి యియ్యది వ్రాసియుండును. కుమారీ! నీవుచాల యదృష్టవంతురాలవు. వెన్నుని జూడగల్గితివని నుడివి యాపద్యమును నొకనిముషములో నిట్లుపూరించెను.

మ. అలవైకుంఠపురంబులో నగరిలో ♦ నామూల సౌధంబు దా
పలమందారవనాంతరామృత సరః ♦ ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగు నా ♦ పన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రముపాహిపాహియనుగు ♦ య్యాలించిసంరంభియై.

ఇయ్యది యనుశ్రుతముగా వినవచ్చుకథల నాధారముగా గొని వ్రాయబడియున్నది.

### పోతన గ్రంథరచనయందుండ మహావిష్ణువాతనిని సర్వజ్ఞ సింగమనాయుని బారినుండి రక్షించుట.

పోతన రచించు భాగవతమును దానెట్లైనను కృతిగొనవలయు నని సంకల్పించుకొని సర్వజ్ఞసింగమనీఁడు తన సేనానాయకునకు గొంత బలము నొసంగి సీవేగి బమ్మెరపోతనామాత్యుని దండించియైన బట్టు కొని మహాభాగవతముతోగూడ నాతనినిచ్చుటకు గొనిరావలసినదని నియమించెను. ఆసేనానాయకుఁడును తృటిలో నాకార్యమును సాధిం చికొని వత్తునని బీరములు పలికి వెడలిపోయెను.

భక్తపరాధీనుఁడగు వెన్నుడు తనభక్తున కపకారముసేయబోవు చున్న నాతనియభిప్రాయమును గ్రహించి యాతని మందలించి వెను కకు పంపనెంచెను. కాని యంతలోనిట్లు వితర్కించెను ఈతనిని వెనుక కిపుడే పంపినచో రేపో లేక మఱియొకనాడో చనుదెంచి యీతఁడు పోతనను బాధింపకమానఁడు. సర్వజ్ఞసింగమనీఁడు ముష్కరుఁడు. అతనికి దగినశిక్ష విధించినగాని సరియైన మార్గమునకురాఁడు. అని వితర్కించుకొని తనతొలుతటి యభిప్రాయ ముపసంహరించుకొనియెను.

ఈసేనానాయకుఁడు పోతనయింటిని ముట్టడించెను. ఆసమయ మున పోతన నిర్భీతితోనుండెను. అపుడు పోతన భాగవతమున యజ్ఞవ రాహావతార ఘట్టమును వ్రాయుచుండెను. అందీ క్రిందిపద్యమును రచించెను.

సీ. కఠినసటాచ్ఛటో ♦ త్కట జాతవాతని
ర్ధూతజీమూత సం ♦ ఘాతముగను
క్షురనిభసునిశిత ♦ ఖరపుటాహతచల
త్ఫణిరాజ దిగ్గజ ♦ ప్రచయముగను
చండ దంష్ట్రోత్థ వై ♦ శ్వాన రార్చిస్స్రవ
ద్రజిత హేమాద్రి వి ♦ స్రంభముగను

ఘోరగంభీరఘుమ ♦ ఘుర ఘురారి నిస్వన
పంకిలాఖిలవార్ధి ♦ సంకులముగ
బొరలుఁ గెరలుసటించు నం ♦ బరము జెరల
రొప్పునుప్పర మెగయును ♦ గొప్పరించు
ముట్టెబిగియించు ముసముస ♦ మూరుకొనుచు
నడచు సంరక్షితక్షోణి ♦ యజ్ఞ ఘోణి.

అను పద్యమును రచించుచున్నప్పటి కేవిధానపోతనను రక్షింతునా యని యాలోచించుచున్న శ్రీమహావిష్ణువు శ్వేతవరాహరూపముదాల్చి యా సేనానాయకుని సైన్యమును ప్రతిఘటించుచుండెను.

పోతన యాసమయమున నీక్రిందిపద్యమును రచించెను.

సీ. తివిరిచతుర్దశ ♦ భువనంబులను దొంతు
లొరగఁ గొమ్ములజిమ్ము ♦ నొక్కమాటు
పుత్తడికొండ మూ ♦ పురమును నొరయంగ
నురుకుచురాపాడు ♦ నొక్కమాటు
ఖురములసప్తసా ♦ గరముల ఱొంపిగా
నుక్కించిముట్టాడు ♦ నొక్కమాటు
నాభీలవాలహ ♦ తాహతిచేమింటి
నొరసిబ్రద్దలుసేయు ♦ నొక్కమాటు
గన్నుగోనల విస్ఫులిం ♦ గములు సెదర
నరుభయంకర గతిఁద్రోచు ♦ నొక్కమాటు
పరమయోగీంద్ర జనసేవ్య ♦ భవ్యవిభవ
యోగ్యమైకానఁ గా నగు ♦ నొక్కమాటు.

అని రచించునప్పటికి యజ్ఞవరాహరూపముననున్న హరి విక్రమించి నిర్వక్రపరాక్రమంబున దన్ను ప్రతిఘటించిన ప్రతివీరులనెల్ల నొక్కుమ్మడిగూల్చుచు సేనానాయకునిబట్టి తొల్లియజ్ఞవరాహము హిరణ్యాక్షుని ఛేదించివధించిన తెరంగున ముట్టుబెట్టెను. ఇట్లు సర్వజ్ఞ సింగమనాయని సైన్యమును ధ్వంసముసేసి దీనితో యీనృపాలునకు

బుద్ధివచ్చును. ఇక నెన్నఁడును పోతనను బాధింప బలమును పూనకుండు ను. అని వితర్కించుచు సంతర్హితుం డయ్యెను.

సింగమనాయఁడు దనకనేక యుద్ధములలో దోడ్పడినట్టియు, విశ్వాసపాత్రుఁడైనట్టియు సేనానాయకుడు మరణించినందుల కెంత యో విలపించెను.

పోతనకు యీసంగతియంతయు గురువాని చెలియవచ్చెను. పర మేశ్వరునకు దనయందుగల వాత్సల్యమును కొంతయు సంతసించినవాఁడై తా నాసమయమున రచించుచున్న ఘట్టమున బ్రహ్మగాలు యజ్ఞవ రాహమూర్తిని సంస్తుతించుటయందు భక్తిభావమును యిట్లువెల్లివిరియు నట్లు వర్ణించియున్నాఁడు.

చ. తలపరసాతలాంతరగ ♦ తక్షితిఁ గ్రమ్మఱ నిల్పినట్టి నీ
కలితన మెన్నవిస్మయము ♦ గాదు సమస్త [illegible]
గలుగగ జేయుటద్భుతము ♦ [illegible]
పలరినకార్యముల్ నడుప ♦ [illegible] మేశ్వరా.

చ. సకలజగన్నియామకవి ♦ చతురాలీల [illegible]
దకధర తావకస్ఫురదు ♦ [illegible]
జ్ఞకుడరణిన్ హుతాశనుని ♦ [illegible]
టకు దలపోసి యీక్షితి ♦ [illegible] చా.

ఉ. విశ్వభవస్థితిప్రళయ ♦ వేళలయం [illegible]
విశ్వము నీవయై నిఖిల ♦ [illegible]
ధీశ్వర ఈశ కేశవ త్ర ♦ [illegible]
శాశ్వతలీల లిట్టివని ♦ [illegible]

సీ. పంకజోదరనీవ ♦ పారకర్మ [illegible]
భవదీయకర్మ [illegible]
నెఱిగెదననియది ♦ నిశ్చయి [illegible]
పరికింపగా [illegible]
విజ్ఞానియేచూడ ♦ విశ్వ [illegible]
మాయాపయోగ [illegible]

దెలిసియు దపబుద్ధి ♦ దెలియనిమూఢుల
నేమన నఖిలలో ♦ కేశ్వరేశ
తే. దాసజనకోటి కతిసౌఖ్య ♦ దాయకములు
పతితలకరుణా సుధాతరం ♦ గితములైన
నీకటాక్షేక్షణములచే ♦ నెఱయమమ్ము
జూచి సుఖులనుజేయవే ♦ సుభగచరిత.

భాగవతమున గొన్ని భాగములు శిథిలమగుటకు గలకారణములు.

ఇపుడు ముద్రితమై మనకులభించుచున్న భాగవతము సంపూర్ణముగా పోతనామాత్యప్రణీతముగాదు. పోతనామాత్యుఁడు రచించినభాగవతములో గొన్ని భాగములు శిథిలములుకాగా నట్టిభాగములను యితరులు పూరించిరి. పోతనామాత్యకృతమగు నాభాగములేల నశించినవి యను ప్రశ్నకు జనశ్రుతముగా నొండు రెండు కథలు వినవచ్చుచున్నవి. వానినీక్రింద బొందుపరచుచున్నాడను.

పోతనామాత్యుఁడు మహాభాగవతము నాంధ్రీకరించుచున్నట్లును, ఆతనికవిత్వ మత్యంతమనోహరమైనదై సుధామయోక్తులతో నిండియున్నదనియు వేంకటగిరి సంస్థానమున కధిపతియైన రావుసర్వజ్ఞసింగమనాయునకు దెలియవచ్చెను. ఆతఁడు పోతనను ప్రార్థించి యాగ్రంథమును దానంకితమును పొందనభిలషించెను.

పోతనామాత్యుఁడు తనభాగవతమును తనయిష్టదైవమగు శ్రీరాములకే యంకితమొసఁగుటకు కృతనిశ్చయుఁడై యుండెను. అందువలన సింగమనాయుని యభిమతము మీఁదేరదయ్యెను.

పోతనకు మఱదియగు శ్రీనాధుఁడు పోతనచెంతకరుదెంచి యాతఁడు మిగులదరిద్రుడై తిఁనతిండియైనలేక యవస్థపడుచుండుట దిలకించి యాతనితో బావా! యేల యీవిధముగా కష్టము లనుభవించెదవు. నీవురచించుచున్న యీభాగవతము నెవ్వరికైననంకిత మొసంగరాదా? నీయట్టివా డంకితమొసంగిన నెంతేని ధనంబునొసంగుటకెందఱేదటో సిద్ధముగానున్నారనిపల్కెను, కానిపోతన యంగీకరింపడయ్యెను.

సింగమనాయుఁడు తనకోర్కె నెఱవేఱమికి గినిసి పోతనచేతనున్న భాగవతమును బలవంతమున దెప్పించి యద్దానిని నశింపుజేయవలయు నను తలంపున దనయంతఃపురమున నొకచో పాతిపెట్టించెను. పోతనయు రామచంద్రున కంకితముగా నేను గ్రంథమురచించితిని. అయ్యది లోకమున నెలసి కలకాలముండుట యారామచంద్రునకు సమ్మతమయ్యె నేని యాతఁడే యాగ్రంథమును వెలికిగొనివచ్చును, అని తలంచి మిన్నకుండెను. కొన్ని దినములు గడచెను.

ఒకనాడు సింగమనాయునిస్వప్నమున శ్రీరామచంద్రుఁడు సాక్షాత్కరించి యాతనికిట్లనియెను. "ఓయీ! లోకములోనున్న స్వార్థపరులలో నగ్రగణ్యుండవై యేలభగవదపచారముగావించెదవు. మహాత్ములగు కవిసార్వభౌములు తుచ్ఛములగు నీయాధనంబులకాసజెందినిన్ను సేవింతురనియే తలంచితివా? పోతన్నవంటి భక్తశిఖామణి, కవిపుంగవుఁడు నిన్నాశ్రయించునా! ఆతఁడు తనభక్తిప్రభావమున నన్నేతన హృదయపంజరమునబంధించియున్నాఁడు. అట్టివానియెడ నీవుమహాపచారమాచరించియుంటివి. అజ్ఞానవశంబునగాని జ్ఞానవశంబునగాని నాకపచారమాచరించినవారిని మన్నింతునుగాని నాభక్తునకు గీడొనరించిన వానినెన్నటికిని క్షమింపను. కావున నీవుపాతిపెట్టించినగ్రంథమును వెలికిదీసి యద్దానిని సభక్తిపూర్వకముగా పోతనామాత్యునకర్పించి క్షమాభిక్షకోరుకొనుము. అట్లుగాదేని నీవునాకోపానలంబున బస్మమగుఁడి భస్మావశేషుఁడ వయ్యెదవు.

ఇట్లు పలికి రామచంద్రుఁ డంతర్హితుఁ డయ్యెను. సింగమనాయఁడుదయమున మేల్కాంచి కాలోచితములదీర్చుకొని సుస్నాతుఁడై శ్రీరామచంద్రుని భక్తితాత్పర్యములు ముప్పిరిగొన పూజించి స్వయముగా నాగ్రంథమును త్రవ్వి యద్దానిని శిరముపైనిడుకొని పోతనామాత్యునిగృహమునకు గొనిపోయి యర్పించి పోతనపాదములపైవ్రాలి "మహానుభావా! తమయెడ మహాపరాధము గావించియుంటిని. రక్షింపవలయును" అని పెక్కువిధముల ప్రార్థించెను. పోతనామాత్యుఁడాతనిని మన్నించి పంపివైచెను.

పోతన గ్రంథమును విప్పిజూడఁగా నందు గ్రంథపాతములుబొడ కట్టెను. పోతన కీరుఁగహానిని రచింపక నోలనోవిడచెను. తరువాత వెలిగందల నారయామాత్యుఁ లద్దానిని పూరించియుండిరి.

పోతనామాత్యుఁడు స్వవిరచితమగు భాగవతమును తన దేవతార్చనపెట్టెయందుంచి నిత్యపూజలుసలుపుచు గౌరవించుచుండెడి వాఁడు. ఆటుపిమ్మట దనయవసానకాలమున కుమారుఁడగు మల్లనను బిలిచి "నాయనా! ఎట్లో కష్టపడి గ్రంథమును సమగ్రముగా రచించితిని. పొట్టకూటికై యద్దాని నొరులకు విక్రయింపక యిన్నిదినముల వరకు దాచి యుంచితిని. నాకవసానము సమీపించినది. నేనీగ్రంథమును నీహస్తమునం దిడిపోవుచున్నాను. నీవు నాయందెట్టి భక్తివిశ్వాసముల జూపియుంటివో యట్లే యీగ్రంథము నెడఁగూడ భక్తివిశ్వాసములుగల్గి లోకమున వెలయింపుము" అనిజెప్పి యప్పగించిమరణించెను.

తదనంతరము మల్లనాదులు గ్రంథమును పరిశోధింపగా నందు కొన్నిభాగములు క్రిములచే నాశనము గావింపబడినవి.

పోతనామాత్యుని శిష్యులుమల్లన మున్నగువారు లోపములను పూరించియుండిరి.

---

## శ్రీనాథుఁడు.

శృంగారనైషధము కాశీఖండము మున్నగు గ్రంథరాజములను రచించి విశేషవిఖ్యాతిగడించిన శృంగార శ్రీనాథకవిసార్వభౌముఁడు పోతనామాత్యునకు మఱఁది. శ్రీనాథుఁడు పోతననుగూడ తనవలెనే యొకభూపాలునాశ్రయమునఁనుంపవలయునని విశ్వప్రయత్నములొనరించుచుండువాఁడు. ఈతఁడుపోతనామాత్యునివాసభూమియగు యేకశిలానగరమునకు తరచుగా పోవుచుండువాఁడు. పోతనగాన్పించినపుడెల్ల బావా! ఇదేమి దుక్కిటెడ్లనుగొని పొలముదున్నుచు నెంతకాలము గడపెదవు.

క. కమ్మని గ్రంథమ్మొక్కటి
ఇమ్ముగ నే నృపతికైన ♦ కృతియిచ్చినచో
సొమ్మని యియ్యరె వెయ్యా
ర్లిమ్మహిదున్నంగనేల ♦ యిట్టిమహాత్మా!

అని వచించుచుండువాఁడు. పోతనయు నెప్పటికప్పుడు నేదో విధముగా తగినసమాధాన మొసఁగుచుండువాఁడు.

ఒకనాఁడు శ్రీనాథుఁడు పల్లకియందెక్కి పోతనామాత్యుని జూడ నరుదెంచుచుండెను. ఆసమయమున పోతన తనచేనుగట్టున గూర్చుండి యేదోవిషయమును గూర్చి యాలోచనలుసలుపుచుండెను పోతన కుమారుఁడగు మల్లన యరకకట్టి పొలముఁనుదున్నుచుండెను. శ్రీనాథుఁడు పోతనకు తనశక్తిసామర్థ్యములు జూపవలయునని పల్లకి మోయువారలను బిలచి ఓరీ వెనుకప్రక్కనున్నవారు, పల్లకిదండిని వదలిపెట్టుఁడు పల్లకి యెప్పటియట్లు నడువగలదనియెను. బోయీలు పల్లకిదండినివదలివైచిరి. పల్లకి మామూలుగా నేగుచుండెను.

పొలమును దున్నుచున్న మల్లనయదిగాంచెను. తోడ నేయాతఁ డాశ్చర్యమగ్నుండై నాయనా! మామ శ్రీనాథుఁడరుదెంచుచున్నాఁడు. పల్లకివెనుకబోయీలు లేకుండగనే నడచుచున్నది. చాలవిచిత్రముగ నున్నదని పల్కెను. పోతన దనయాలోచనమును చాలింపకకుమారా! వింతయేమున్నది. దాపలియెద్దును విప్పివేయుము. నీనాగలికూడ యట్లే నడువగలదనియెను. మల్లనయుఁనావినోదమును జూడవలయునని దాపలకట్టిన యెద్దును విప్పివైచెను. నాగలియెప్పటి యట్లునడచుచుండెను. మల్లనయెంతయు వింతనొంది తిలకించుచుండెను.

శ్రీనాథుఁడు బోయీలవలన నాగలి దాపలియెద్దు లేకుండగనే నడచుచుండుట విని యెంతయు సంతసించి మరల బోయీలను పిలచి, ఓరీ! ముందుభాగమునుగూడ వదలిపెట్టుఁడని యాజ్ఞాపించెను. బోయీలు పల్లకిదండిని వదలివైచిరి. పల్లకి యెప్పటియట్లు నడచిపోవుచుండెను. మల్లన యదిగాంచి తండ్రికెఱిగించెను. పోతనయు కుమారా! ఆశ్చర్యము జెందకుము. వలపలియెద్దునుగూడ విప్పివేయుము. నాగలి యెప్పటికంటె సులభముగా నడువగలదని పల్కెను. మల్లనయు నట్లే గావించెను. నాగలి యథాప్రకారముఁగా సాగిపోవుచుండెను.

బోయీలు రెండువైపులను యెద్దులు లేకుండ బోవుచున్న విషయమును శ్రీనాథునకు తెలియజేసిరి. శ్రీనాథుఁడు తన యపరాధమును గుర్తించి దిగ్గున పల్లకినుండి దిగి పోతనామాత్యుని సమీపించి, బావా! క్షేమమా! తమ దర్శనార్థ మగుదెంచుచుంటినని వచించెను. పోతనయు నాతని సముచితగౌరవమున నాదరించి తనగృహమునకు గొనిపోయెను.

## విందు భోజనములు.

పోతనామాత్యుఁడు స్నానసంధ్యాదికములు గావించుకొని దేవతార్చన గావించుచుండెను. శ్రీనాథుఁడు వీధియరుగుపై గూర్చుండి మల్లనమున్న గువారితో నేదో విషయములనుగూర్చి ముచ్చటించుచుండెను.

శ్రీనాథుఁ డాగర్భశ్రీమంతుఁడు. బుద్ధి వచ్చినదాది గ్రంథముల రచించి యేభూపాలునకో యంకితమొసంగి వారిచే మన్నన లందుచుండువాఁడు కావున భోగలాలసుఁడై యుండెడువాఁడు. గడియ భోజనమున కాలస్యమైన యుగముగా దలంచి తల్లడిల్లువాఁడు. అట్టివాఁడు పోతనయింటి కతిథిగా వచ్చెను. దేవతార్చన యగుచున్నది. అంత నింతట నది తెమలునట్లు గాన్పడదు. ఆతనిఆకలి ఆకస మంటుచున్నది. అట్టిస్థితిలో నాతఁ డెట్లుండునో పాఠకమహాశయులే యూహింతురుగాక.

మరియు శ్రీనాథుఁ డొక్కఁడు మాత్రమేగాక యాతనితో నరుదెంచినవారును, శిష్యులును, మరికొందరు పండితులును గూడ నుండిరి. వీరందరికిని పోతన యానాఁడు విందుచేయుట కుద్దేశించెను. పోతన యెంతటిభాగ్యవంతుఁడో శ్రీనాథుఁడు చక్కగా నెఱుంగును. రెండుజాములు కావచ్చినది. ఇంట వంట జరుగుచున్న సవ్వడి యేమాత్రమును వినబడుటలేదు. ఇదంతయును గమనించి శ్రీనాథుఁడు 'కట్టా! ఈతని సంసారము లేమిడిగల్గినది. నేనొక్కఁడనేగాక పలువురు నాతో వచ్చినవారు గలరు. వీరికందరికిని దగు పదార్థముల నీతఁ డెక్కడనుండి తేనోపును.' అని విచారించుచుండగా పోతన దేవతార్చ

నము పూర్తిగావించుకొని సెలికిరుదెంచి బావా! ప్రొద్దుపోయినది లెమ్ము మడికట్టుకొనుము. వడ్డన యగుచున్నదనియెను. శ్రీనాథుఁడు ఆకలితో నున్నవాడు గావున బ్రతుకుజీవుఁడా యని లేచి మడి గట్టుకొనియెను. ఆతనితోబాటుగ పండితులెల్లరును మడిగట్టుకొనుటకై లేచిరి.

భోజనమునకు శ్రీనాథుఁడు మున్నగువా రెల్లరును పీటలపై గూర్చుండిరి. అంత పోతన్న అక్కా! తడవేల వడ్డనగావి పుమని కేకవైచెను. తోడనే భారతీదేవి చక్కని స్త్రీరూపము ధరించి ప్రత్యక్షమై వివిధభోజ్యములను వారికెల్లరకును వడ్డించెను. శ్రీనాథుఁడు తానీవరకెన్నఁడును రుచిఁజూడని భోజ్యము లభించుటచే నెంతయు సంతసించి తృప్తిదీర భుజించెను.

శ్రీనాథుఁడు పోతన మాహాత్మ్యమున కెంతయు సంతసించి యాతని నెన్నియోవిధముల నుతించెను.

భాగవత విమర్శనము.

పోతన భాగవతము వ్రాయుచు నొక్కనాడు దన్నుజూచుట కరుదెంచిన శ్రీనాథున కద్దానిని జూపెను. శ్రీనాథుఁడు గ్రంథ మక్కడక్కడ దిలకించి అందు అష్టమస్కంధములోని గజేంద్రమోక్షసందర్భమునజెప్పిన యీక్రిందిపద్యమును ముమ్మారు చదివెను.

మ. సిరికింజెప్పఁడు శంఖచక్రయుగమున్ ♦ చేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం ♦ బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము జక్కనొత్తఁడు వివా ♦ దప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ ♦ ప్రాణావనోత్సాహియై.

అట్లు చదివి చెంతనేయున్న పోతన్నను గనుంగొని బావా! యిదేమిట్లువ్రాసితివి. ఆయుధములు లేకుండ గజరాజును విడిపింపనేగుటలో నాతనియభిప్రాయమేమి మకరమును చేతులతో గ్రుద్ది జంపదలంచెనా? లేక మరేమి చేయదలంచెను.

పోతన యప్పటికేమియు సమాధానమొసంగక నవ్వుచు యూరకుండెను. తదనంతరము శ్రీనాథుఁడు తనపంక్తిని గూర్చుండి భోజనము

చేయుచుండగా తన కేదియో పనియున్నదని చెప్పి వడివడిగా భోజనమంత రించి లేచిపోయెను. వీధిలో నాడుకొనుచున్న శ్రీనాథుని కుమారుని లాలించుచు నెత్తుకొని దీసికొనిపోయి సమీపమున నున్న మరియొకరి యింటిలో నా బాలుని దాచి నూతిపెరటిలోని కరుదెంచి, యొక పెను రాతిని గుభాలున నూతిలోనె త్తివైచెను. అంతట పోతన యెలుగెత్తి "బావా! శ్రీనాథా! రమ్ము రమ్ము." నీకొమరుండు నూతఁబడినాఁడు." అని యఱచెను. శ్రీనాథు డింకను భోజనము చేయుచుండెను. ఆమాట వినబడినంతనే విస్తరినుండి గుభాలున లేచి చేయికడుగుకొనకుండా నతి వేగమున నూతిపెరటిలోనికరుదెంచి అయ్యో! యని రోదనము చేయుచు, హా! కుమారా! యని నూతిచుట్టు ప్రదక్షిణము చేయుచు, గుండెలు బాదుకొనుచు బేలవలె వాపోవదొడఁగె. లేక లేక చిరకాలమునకు గలిగిన కుమారుడగుటచే యెవరి కట్టి బాధయుండదు?

కటా! నానోములపంట! నీవేమో వంశోద్ధారకుఁడవనియు, చిరాయుష్మంతుఁడవనియు, సుగుణఖనివనియు, దైవజ్ఞులెందరో పేర్కొనియుండిరే. అన్నా! యెంతకష్టమెంతకష్టము. ఇక నాకీజన్మమేల? నేను కూడ నీ బావిజొచ్చెదనని, నూతిలో పడుటకు యత్నించుచుండ, నంత పోతన "ఏదీ! బావా! ఆపదలందు ధైర్యము వహింపవలయును గాదా! ఇదియేనా నీధైర్యము." అని యాక్షేపించుచు శ్రీనాథునిగాంచి నవ్వుచు పెండియు నిట్లనియెను. "నీవెన్నియోయిట్టియిక్కట్టులపట్ల ధైర్యము వహింపవలెనని చెప్పినయుపన్యాసములన్నియు నేమైపోయినవి. ఇంతి యేనా నీధైర్యసాహసములు. ఆడుదానివలె వాపోవుచు నూతిలో నురకజొచ్చెదవా? చాలులెమ్ము, నూతిలోబడ్డబిడ్డను దీయుటకై యత్నపడుము.

అవును. నిచ్చనయేది? త్రాళ్లేవి? తట్టలేవి? తగినయుపకరణములసంపాదించి బిడ్డను పైకిదీయునుపాయ మాలోచింపవలెగాని యూరక వాపోవుట పురుషలక్షణమా" అని యనుచుండ పోతనమాటలయొక్క భావమును కనిపెట్టి నాబిడ్డకేవిధమయినతొందరయు గలుగలేదు. ఇదంతయు పోతనగావించినకపటనాటకవిశేషమే. నాడు భాగవతము

లో "సిరికింజెప్పడు" అనుపద్యము తాను చదివినప్పుడు నేనేదియో యాక్షేపణలోనరించితినని; ఇప్పుడీ పద్యార్థమంతయు పన్నియుండెనది తెలిసికొంటినియెను. అపుడు శ్రీనాథుడు పోతనను కుమారునిజూపవలసినదని ప్రార్థించెను. పోతనయిట్లనియెను. బావా! నీకుమారునిపైనీకెంతటివాత్సల్యమో భక్తునియెడల పరాత్పరునకుగూడ నంతటివాత్సల్యమే గలదు. ఆవాత్సల్యముచేతనే గజేంద్రుని యాలాపము వినవచ్చినంతనే యున్నపాటున నేలేచి భగవంతుడు పరువిడివచ్చుచుండెను. ఆతడాయుధములేకున్నమాత్రమున మకరినిద్రుంపలేడా! మనము నూతులలోబడిన వానిని పైకిదీయుటకుసాధనములుపయోగింపవలయునేగాని యామహానుభావునకు ఆయుధములతోపనియేమి. నాడుశిశుపాలునివధించునాడు ధర్మరాజు పూజాద్రవ్యములతో నెసంగిన పళ్లెరమేగదా చక్రమయ్యెను. అని వివరించి యాతనియాక్షేపణను సోదాహరణముగా ప్రత్యుత్తరమొసంగెను.

## భాగవతమును లక్షణగ్రంథముగా గొనకుండుట

భాగవతమున గొన్నిచోట్ల రేఫఱకారములకు ప్రాసస్థానములందును విశ్రమస్థానములందును మైత్రియుండుట గాన్పించుచుండుటచేత అప్పకవి తనయప్పకవీయములో నిట్లు వ్రాసియున్నాడు.

ఉ. బమ్మెరపోతరాజకృత ♦ భాగవతమ్ము సలక్షణమ్ముగా
కిమ్మహినేమిటంగొదవ ♦ యెంతయునారసిచూడగాను రే
ఫమ్ములు ఱాలునుంగలసి ♦ ప్రాసములైనకతంబునంగదా
యిమ్ములనాదిలాక్షణికు ♦ లెల్లరు మానిరుదాహరింపగాన్.

కాని పరికింపగా నీరేఫఱకారసాంకర్యము పోతనకృతములగు భాగములందంతగా గనబడదు. నారయసింగన, గంగనమున్నగువారు రచించిన భాగములలోమాత్రమే గనబడుచున్నది.

ఈవిషయమును చర్చించి కూచిమంచి తిమ్మకవి తనసర్వలక్షణసారసంగ్రహమున నిట్లువ్రాసినాడు.

ఆ. వె. కాకునూరియప్ప ♦ కవి యుపశోభలకతి
ముద్దరాజు రామ ♦ ముఖ్యులెల్ల

బోతరాజు కబ్బ ♦ మున ఱాలు రేఫలు
గదిసెనంచు జెప్పి ♦ రదిహుళక్కి.

సీ. ఘనుడు పోతన మంత్రి ♦ యును భాగవతము ర
చించి చక్రికి సమ ♦ ర్పించు నెడల
సర్వజ్ఞసింగము ♦ క్ష్మావరుడదితన
కిమ్మని వేడగా ♦ నీయకున్న
నలిగియాపుస్తకం ♦ బవని బాతించిన
జివికియందొకకొంత ♦ శిథిలమయ్యె
గ్రమ్మఱ నది వెలి ♦ గండల నారప్ప
రాజును మరిబొప్ప ♦ రాజు గంగ
రాజు మొదలగుకవివరుల్ ♦ తేజమెసగ
జెప్పిరాగ్రంథములయందె ♦ తప్పులొదవె
గానిపోతకవీంద్రుని ♦ కవితయందు
లక్షణంబెందుదప్పునా ♦ దక్షహరణ.

కూచిమంచి తిమ్మకవి రేఫఱకారసాంకర్యము లేని పద్యములను గొన్నిటిని నిరూపించియున్నాడు. ఆపద్యములను మదికొన్నింటినిగూడ నిం దుదాహరించుచున్నాడను.

ఉ. మాఱువడంగలేని యొఱస ♦ మర్థులసుప్తుల నస్త్రవిద్యలం
దేఱనిపిన్నపాపలవ ♦ ధించెనిషిద్ధపుఁ గ్రూరకర్ముఁడై
పాఱుఁడె వీఁడుపాతకుఁడు ♦ ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం
బాఱెడివీనిఁ గావుముకృ ♦ పామతి నర్జున పాపవర్జనా.

చ. వెఱచినవానిదైన్యమున ♦ వేఁదుఱునొందినవాని నిద్రమై
మఱచినవాని సౌఖ్యముగ ♦ మద్యముఁ ద్రావినవానిభగ్నుఁడై
పఱచినవానిసాధుజడ ♦ భావమువానిని గావుమంచువా
చఱచినవానిఁ గామినుల ♦ జంపుటధర్మముగాదు ఫల్గునా.

ప్రథమస్కంధము.

క. ఎఱుఁగుదుఁ దెఱవాయిప్పుడు
మఱవనుసకలంబు నన్ను ♦ మఱచినయెడలన్

మఱుతునని యెఱింగి యెఱుఁగక
మఱవక మొఱయిడిరయేని ◆ మఱియన్యములన్.

క. ఒఱపగునురమును బిరుదును
నెఱిదోఁకయు ముఖముసిరియు ◆ నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ జెలిగన్నులు,
దఱుచగుకంఠంబుఁ జూప ◆ దగునాహరికిన్.

ప్రాసయతి.

ఆ. వె. చావులేనిమందు ◆ చక్కనమనకబ్బె
ననుచుఁ గడవయసురు ◆ లడచికొనిన
వెఱచి సురలుహరికి ◆ మొఱలువెట్టిరిసుధా
పూర్ణఘటముపోయెఁ ◆ బోయెననుచు.

ఆ. వె. వాలుగంటివాఁడి ◆ వాలారుచూపుల
శూలిధైర్యమెల్లఁ ◆ గోలుపోయి
తఱలియెఱుక లేక ◆ మఱచెనుగుణంబుల
నాలి మఱచె నిజగ ◆ ణాళిమఱచె.

ప్రాసము.

క. వెఱచుచు వంగుచుప్రాలుచు
సఱిమిఁ ఱిగుబురులకు జనుచు ◆ హాహాహారియనుచున్
మఱుగుచు నులుకుచు దిరదిరఁ
గుఱుమట్టపుఁ బొట్టివడుగు ◆ కొంతెసఁటెంచెన్.

క. కుఱుగఱులు వలుదమీసలుఁ
జఱుదోఁకయు బసిఁడి యొడలు ◆ సిరిగలపాడలున్
నెఱమొగము నొక్కకొమ్మును
మిఱుచూపులు గలిగివిభుఁడు ◆ మీనంబయ్యెన్.

క. పెఱవాఁడు గురుడటంచును
గొఱగానిపదంబుసూపఁ ◆ గుజనుండునుస
నెఱిత్రోవనడవనేర్చిన
సఱమఱలేనట్టిపదము ◆ సందుదయాఢ్యా.

మ. ఉఱుకున్ గుంభయుగంబుపై హరి కిరుక్ ◊ హుమ్మనుచు బోదమ్ముల్లలం
దిఱుగున్ గంఠము నెన్నుదన్న నగయున్ ◊ హేలాగతిన్ వాలమున్
జఱుచున్ గ్రాహము దాఁకు ముంచుచు నణుగుక్ ◊ శల్యాంబులున్ దంతముల్
విఱుగన్ ద్రెవ్వయు చుం బోరుచుఁ బోరి కదియుక్ ◊ వేదండయూథోత్తమున్.

మ. ఉఱకంభోనిధి నొసి సేవకులకు ◊ యుగ్రాంధైన్యముం జూచి వే
గఱలల్లార్చి ముఖంబు సాచి బలుకిన్ ◊ కిందోక నారించి మే
న్నెఱ యోంగోడలు దీటి మీనలజరన్ ◊ మీనాకృతి న్విష్ణుఁడ
కఱటిందఁ కినఘాంచె ముష్టిదళిత ◊ గ్రావుక్ హయగ్రీవునిన్.

క. మఱియును దనుజుడు రాముని
గఱవన్ గమకించి తెఱపి ◊ గానకయుంతన్
జుఱజుఱ జూచుచు శౌర్యము
బఱినోవగ నంతనింత ◊ బదములదన్నెన్.

క. కఱచిపిఱుదివక మఱియును
వెఱవక నిజవదనజనిత ◊ విషదహనశిఖల్
మెఱయదననిడుదనొడలిని
నెఱిహరిఁ బెనగొనియె భుజగ ◊ నివహాపతివడిఁక్.

క. అఱువది నాలుగు విద్యల
నఱువది నాలుగు దినంబు ◊ లంతన వారల్
నెఱవాదులైన కతమున
నెఱినొక్కొకనాటివినికి ◊ నేర్చిరి లేశా.

ఇట్టివి పోతనకవిత్వమున గనబడుట జేసి యాతఁడు రేఫఱకారము లభేదము గుర్తించినవాడనియును, రేఫఱకారములసాంకర్యమును అంగీకరింపనివాడనియును స్పష్టమగుచున్నది. పోతనరచించిన భాగవతములో నొకటిరెండు స్థలములయందు మాత్రమే యీదోషము గానబడుచున్నది. దానినీక్రింద యుదాహరించుచున్నాను.

ఉ. పాఱఁడు లేచిదిక్కులకు ◊ బాహువులొడ్డఁడు బంధురాజిలో
దూఱఁడు ఘోరకృత్యమని ◊ దూఱఁడు తండ్రినిమిత్రవర్గముం

క్షీర డుమ త్రసంఘము వ ॥ సించు సువర్ణగృహాంబులోనికిం
దాఱఁడు కావరేయనఁడు ॥ తాపమునొందఁడు కంటగింపఁడుర్.

సప్తమస్కంధము.

క॰ పోరుదురు గిరురునొడుచుచు
దూఱుదురు......................... దశమస్కంధము॰

చ॰ విరవిర లేనియట్టి బలు ॥ వీరుఁడు కృష్ణకుమారుడొక్కచేఁ,
జఱచి......................... ద॰ స్కం॰ పూర్వభాగం॰

చ॰ మఱియొక నాటిరాత్రిబల ॥ మాధవులుజ్జ్వలవస్త్రమాలికా ధరులును

ఈప్రయోగములు ప్రమాదజనితములుగాగాని మతభేదమున గాని లేక యితరకారణమునగాని ప్రయోగింపబడినవేగాని పోతన యుభయమైత్రి పాటించినాఁడుకాడనుట తగదు.

వెలిగందల నారపరాజు మున్నగువారు రచించిన భాగములందు రేఫఱకారసాంకర్యము గనబడుచున్నది. వాని స్క్రింద నొసంగు చున్నాడను.

క॰ మఱిచియు ఋష్యాశ్రమవన
పరిసరిదుపవనపులింద ॥ జనపదగిరిగ
హ్వర గోష్టయజ్ఞశాలా
పురదేవాయతన పుణ్య ॥ భూముల యందుర్.

చ॰ హరిబరమాత్మునచ్యుతున ॥ నంతునిజిత్తములో దలంచి సు
స్థిరత విశోక సౌఖ్యముల ॥ జెందిన ధీనిధులన్యకృత్యముల్
మఱిచియు జేయనొల్లరు త ॥ లంచినయట్టి దయాసురేంద్రుడున్
బరువడి నాయిద్రవ్వెడు వి ॥ పానఖనిత్రమునానుకైవడిన్.

క॰ ధర శునక భోగ్యమును నిహ
పరదూరమునైన తనువు ॥ పాథేయముగా
నెఱినమ్మి వస్త్రమాల్యా
భరణంబు లలంకరించు ॥ పామరజనులన్.

మ॰ తెలుగొప్పన్ జననీవియోగమున గుం ॥ తీ స్తన్యపానంబు సో
దర సంరక్షయు గల్గ దేవవిభువక్త్రి ॥ స్థామృతంబున్ ఖగే

శ్వరు డగ్గింగ బులోన్న మాడ్కి- గుసుమాశ . క్షేణిసగ్గించి త
ద్ధరణీరాజ్యకుసుగోన్న దూత్రికౌగుకుల్ కృ ఫనాధ్యాత్ములే యుద్ధవా.

క. పరగగ దర్పోద్ధతులి
ద్దఱు కౌసుకులు సీకుబుట్టి ♦ ధరణికివ్రేగై
నిరతము బుధజనపీడా
పరులై వ_ర్తింతు రాత్మ ♦ బలగర్వమునన్.

క. వరుణుని బలములు దనుజే
శ్వరు తేజము పెరిమాడ ♦ జాలక శౌర్య
స్ఫురణము చెడి యొంచేనియు
బఱచెఁ దజ్జలధిమధ్య ♦ భాగమునందున్.

క. వినుము ఫలారంభుడు కృష
ణుని నడిగిన దన యశంబు ♦ నుం దనమానం
బును జెడుగావున దగనీ
వెనయు వివాహేచ్ఛ దగు ♦ లుజెటిగెనిటకుఁ.

క. ధరణీసుగో_త్రముడు తా
నరుదుగ దనువారు సెప్పి ♦ నవియెల్లను నే
మఱకందు బ్రీతిసేయః
నిరతము గృహకర్మమట్లు ♦ నెఱపుచు నుండెన్.

చ. కరువలిబాయ వస్త్రమును ♦ గట్టనెఱుంగవు చూడ్కి- దిక్కులన్
బఱచుచు జంచరీకముల ♦ భాతి జెలంగెడు కంధరంబునన్
బారలెను ము_క్తకేశభర ♦ ముంపుఱుమంగదలంప విప్పుడి
ట్లరుదుగ రత్నకందుక వి ♦ హారముసల్పెదు సంభ్రమంబునన్.

క. ధరణీవల్లభనిన్నును
నిరతంబును బుద్ధదేవు ♦ నింగొలచిన యా
తెఱగున గొలిచెదమని భా
సురమతి బోధించిరపుడు ♦ సుమతిం బ్రీతిన్

క. పరిపూర్ణంబగు భ_క్తిని
గరమనిశము సంశయాత్మ ♦ కంబయిచాలన్

వఱలిన హృదయగ్రంథిని
నిరసించు విరక్తియుకును నీవజనించెన్.

చ. హరిభజనీయ మార్గనియ ♦ తాత్మకులై భవదీయమూర్తిపై
వఱలిన భక్తియుక్తులగు ♦ వారలసంగతి గల్గజేయు స
త్పురుషసుసంగతిన్ వ్యసన ♦ దుర్భరసాగరము ప్రయత్నతన్
సరసభవత్కథామృత ర ♦ సంబున మత్తుడనై తరించెదన్.

చ. నిరతము దావకీనభజ ♦ నీయపదాబ్జసుగంధలబ్ధి నె
వ్వరిమది పొందగా గలుగు ♦ వారిలు తత్ప్రియమర్త్యదేహమున్
గరము తనీయ దారసుత ♦ కామసుహృద్గృహబంధువర్గమున్
మఱతురు విశ్వతోముఖ! ర ♦ మాహృదయేశ! ముకుంద! మాధవా.

భాగవతము-ఆంధ్రీకరణము.

వేదవ్యాసవిరచితమగు భాగవతమునను సరించి పోతనామాత్యు డొక స్థలమున కొంతవరకు కల్పితములను జేర్చుచు, వేరొక యెడకొలది గా సంకుచితము గావించుచు గ్రంథమును చక్కగాపోషించియాంధ్రీక రించినాడు. ఇతడు భాగవతమంతయు నద్వైతపరముగానే రచించి యుండెనని విస్పష్టమగుచున్నది.

ఇతడు తనయాంధ్రీకరణమునకు శ్రీధరుల వ్యాఖ్యానము నూ తగా గొనియున్నాడు. ఈవిషయమును యీక్రింది నొసంగబడినవ్యా ఖ్యానము ఋజువు సేయగలదు.

శ్లో. నమోనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే.

ఈ శ్లోకమునకు శ్రీధరులవా రిట్లువ్యాఖ్యానము గావించి యున్నారు.

నమఇతి. అనంతాయ, అహంకారాపరిచ్ఛేదాత్ అత: సూక్ష్మా య, అదృశ్యత్వాత్ అతఏవకూటస్థాయ, ఉపాధికృత వికారాభా వాత్ అతఏవవిపశ్చితే సర్వజ్ఞాయ॥ నానేతి॥ నానావాదానురోధాయ అస్తి, నాస్తిసర్వజ్ఞః కించిదజ్ఞః బద్ధః, ముక్తః ఏకః, అనేకః, ఇత్యాదీన్ నానావాదాన్ అనురుణద్ధి మాయయానువర్తతే యస్తస్మై వాచ్య

వాచకశక్తయే అభిధానాభిధేయ శక్తిభేదాదపి నానాత్వప్రతీయమా నాయ; కుతః, శాస్త్రయోనయో వేదాత్మకనిశ్వాసాయ.

పైవ్యాఖ్యానమునను సరించి పోతనరచించిన యాంధ్రకరణము.

గీ. ......మూఢహంకృతులచే ♦ ముసుగుపడక
నెఱిననంతుఁడ వైదర్శ ♦ నీయరుచివి
గాక స్వాత్మస్థుఁడవై నిర్వి ♦ కారచిహ్న
దనరికూటస్థుఁడవైన నను ♦ స్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెదమాలింపు ♦ నిర్మలాత్మ.

వ. మఱియుఁ గలాదులచేతను, సంవ్యాప్తంబు నెఱుఁగునిచ్చుక యెఱుంగు బద్ధుండు ముక్తుండను, నొకండ నేనుండు ననునివి మొదలుగాఁగల వాదంబుల మాయవలన ననురోధింతువు కావున నానావాదానురోధకుండవయ్యు నభిధానాభిధేయ శక్తిభేదంబువలన బహుభావప్రతీతుండవయ్యును, జక్షురాదిరూపంబులవలన ప్రమాణమూలకుండవయ్యు వేదమయనిశ్వాసత్వంబువలన శాస్త్రయోనివయ్యు కొన్నియెడల కావ్యసరణికి సరసముగానుండని తత్త్వఘట్టములనుగూడ నత్యంతమధురిమ ములుకునట్లు రచించుటయందు పోతన మిక్కిలి నిపుణుడు.

సప్తమస్కంధము.

శ్లో॥ మతిర్నకృష్ణేపరతస్స్వతో వా మిథోభిపద్యేతగృహవ్రతానాం।
అదాంతగోభిర్విశతాంతమిస్రంపునః పునశ్చర్విత చర్వణానామ్॥

ఈశ్లోకమునకు పోతనామాత్యుని తెనుగు.

ఉ. అచ్చపుఁజీకటింబడి గృ ♦ హవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁబుట్టుచున్ మరల ♦ జర్వితచర్వణులైనవారికిన్
జెచ్చెరఁబుట్టునే పరులు ♦ సెప్పిననైననిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గాననలకు ♦ నేగిననైన హరిప్రబోధముల్.

మూలము.

శ్లో॥ నతేవిదుస్స్వార్థగతిం హి విష్ణుం
దురాశయాయేబహిరర్థమానినః
అంధాయథాంధైరుపనీయమానా
వాచీశతంత్ర్యాముఱుదామ్ని బద్ధాః॥

శ్లో॥ నైషాంమతిస్తావదురుక్రమాంఘ్రిం
స్పృశత్యనర్థాపగమోయదర్థః
మహీయసాం పాదరజోభిషేకం
నిష్కించనానాం నవృణీతయావత్.

ఉ. కాననివాని నూతగొని ♦ కాననివాడు విశిష్టవస్తువుల్
గాననిభంగిఁ గర్మములు ♦ గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుని కొందరల్ల ♦ గందురకించన వైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తులగు ♦ సంహృతకర్ములు దాన వేశ్వరా.

మరియు పోతనరసోద్దీపకములు కానిపట్లను గూడ దనరచనా చమత్కృతిచే సత్యంతమనోహరములై యుండునట్లుగా వర్ణించియుండెను. ఈ క్రిందిశ్లోకమును దానికి తెనుగుసేతయు గమనించిన నీవిషయము తెల్లమగును.

సప్తమస్కంధము - పంచమాధ్యాయము.

శ్లో॥ ఏకదాసురరాట్పుత్ర మంకమారోప్య పాండవ?
పప్రచ్ఛకథ్యతాం వత్స! మన్యతే సాధుయద్భవాన్.
దీనికి పోతన్నగారి తెనుగు.

శా. అంతంగొన్ని దినంబులేఁగిన సురేం ♦ ద్రారాతిశంకాన్విత
స్వాంతుండై నిజనందనున్ గురువులే ♦ జాడం బఠింపించిరో
భ్రాంతుండేమిపఠించునో పిలిచి సం ♦ భాషించివిద్యాపరి
శ్రాంతింజూచెద గాక నేడని మహా ♦ సౌధాంతరాసీనుఁడై.

ఉ. మోదముతోడ దైత్యకుల ♦ ముఖ్యుఁడు రమ్మని చీరబంచెఁ బ్ర
హ్లాదకుమారకున్ భవమ ♦ హార్ణవతారకుగామరోషలో
భాదిపరోధివర్గపరి ♦ హారకుఁ గేశవచింతనామృతా
స్వాదకతోరకుం గలుష ♦ జాలమహాగ్రవనీకుఠారకున్.

వ. ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు నరుదెంచిన,

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమే ♦ యుద్యోగమాహాత్మ్య సం
విత్సంపన్నుఁడవైతివే చదివితే ♦ వేదంబులున్ శాస్త్రముల్

వత్సారమ్మని చేరఁజీరికొడుకున్ ◆ వాత్సల్యసంపూర్ణుండై
యుత్సంగాగ్రముజేర్చి దానవవిభుం ◆ డత్యంతదీపింపగన్.

క. అనుదినసంతోషణములు
జనితశ్రమతాపదుఃఖ ◆ సంశోషణముల్
తనయులసంభాషణములు
జనకులకుం గర్ణయుగళ ◆ సద్భూషణముల్.

వ. అని మరియుఁ బుత్రా! నీకెయ్యది భద్రంబై యున్నది చెప్పు మనిన గన్నతండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె.

అష్టమస్కంధము-తృతీయాశ్వాసము.

శ్లో॥ తంతద్వదార్తిముపలభ్యజగన్నివాసః స్తోత్రంనిశమ్య
దివిజైస్సహాసంస్తువద్భిః । ఛందోమయేనగరుడేనస మూ
హ్యమానశ్చక్రాయుధోభ్యగమదాశు యతోగజేంద్రః॥
సోంతస్సరస్యుడుబలేనగృహీత ఆర్తోదృష్ట్వాగరుత్మతిహ
రింఖఉపాత్తచక్రం । ఉత్క్షిప్యసాంబుజకరంగిరమా
హాకృచ్ఛ్రాన్నారాయణాఖిలగురోభగవన్నమస్తే.
తం వీక్ష్యపీడితమజస్సహసావతీర్య సగ్రాహమాశు
సరసఃకృపయోజ్జహార । గ్రాహాద్విపాటితముఖాదరి
ణాగజేంద్రం సంపశ్యతాం హరిరమూముచదుస్రియాణాం.

ఈమూడు శ్లోకములకు

మ. అలవైకుంఠపురంబులో నగరిలో ◆ నామూలసౌధంబు దా
పలమందారవనాంతరామృతసరః ◆ ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోదియగునా ◆ పన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహియనుకు ◆ య్యాలించిసంరంభియై.

అను నీపద్యము మొదలుకొని

శా. పూరించున్ హరిపాంచజన్యముగృపాం◆భోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృతమహా ◆ భూతప్రచైతన్యమున్
సారోదార శితప్రభాచకితప ◆ ర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమునుని ◆ ర్ధూతద్విషత్సైన్యమున్.

అను పద్యమువఱకును గల ఇరువదిపద్య గద్యములును రచించి యున్నాడు.

నవమస్కంధము-నవమాధ్యాయము.

శ్లో॥ వ్యావాయకాలేదదృశేవనౌకోదంపతీ ద్విజౌ
క్షుధార్తోజగృహేవిప్రంతత్పత్న్యాహాకృతార్థవత్
నభవాన్ రాక్షసస్సాక్షాదిక్ష్వాకూణాం మహారథః
మదయంత్యాః పతిర్వీరనాధర్మంకర్తుమర్హసి
ఏషహిబ్రాహ్మణో విద్వాన్ తపశ్శీల గుణాన్వితః
సోయంబ్రహ్మర్షి వర్యస్తేరాజర్షి ప్రవరాద్విభోః
కథమర్హతిధర్మజ్ఞ! వధంపితురివాత్మజః
తస్యసాధోరపాపస్యభ్రూణస్యబ్రహ్మవాదినః
కథంవధంయథాబభ్రోర్మన్యతే సన్మతోభవాన్
యద్యయంక్రియతే భక్షస్తర్హిమాంఖాదపూర్వతః
నజీవిష్యేవినాయేనక్షణంచ మృతకంయథా
ఏవంకరుణభాషిణ్యా విలపంత్యా అనాథవత్
వ్యాఘ్రః పశుమివాఖాదత్సౌదాసశ్శాపమోహితః॥

తెనుగు

క. ఆకట మలమలమాడుచు
నీకనతండడవినున్న ♦ విప్రమిథునముం
దాకి తటాలున విప్రుని
గూకటిచేబట్టిమ్రింగ ♦ గొనిపోవుతరిన్.

వ. అంత నాబ్రాహ్మణునిభార్య పతికి నడ్డంబువచ్చి యేడ్చుచు నా రాచరక్కసున కిట్లనియె.

మ. రవివంశాగ్రణివై సమస్తధరణీ ♦ రాజ్యానుసంధాయివై
భువనస్తుత్యుడవై పదార్థరతివై ♦ పుణ్యానుకూలుండవై
వివరంబేమియులేక నాపెనిమిటిన్ ♦ విప్రుం దపశ్శీలు స
త్ప్రవరున్ బ్రహ్మవిదున్ జగన్నుతగుణున్ ♦ భక్షింపగాబాడియే.

మ. తండ్రీ మీకు నిశేశవంశజులకున్ ◆ దైవంబకున్ బ్రాహ్మణుం
డుగ్రాయాసులు సేవె భూమిసురు నీకో ◆ హత్యాభిలాషంబు నై
కొంగ్రాడే మీయట్టివారికి సాధువులు ర ◆ క్షోభావ మిట్లైల మీ
తండ్రింబాతలఁ బూర్వులం దలఁపవే ◆ ధర్మంబునం బోఁగ దే.

శా. అన్నా చెల్లెలనయ్య దక్కఁ జీమున్ ప్రా ◆ కన్నంబు వెట్టింతు నా
హ్నాన్నాథున్ ద్విజుఁగాఁగి రుక్షిననటా ◆ హింసింపఁ నెలయ్యా నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె నిజం ◆ బిట్టైన యున్నట్ట నా
పన్నన్ నన్ను శిరంబు ద్రుంచి మఱి మ ◆ త్ప్రాణేశు భక్షింపవే.

కం. అని కరుణపుట్ట నాడుచు
వనితామణి పలకరింప ◆ వసుధాదేవుం
డినియె నతఁడు పులి పశువుం
దినుక్రియ శాపంబు కతన ◆ ధీరహితుండై.

పోతనామాత్యుఁడు నాచనసోముని హరివంశమును దిలకించి యందుగల పోకడల గొన్నింటిని దనభాగవతమున పొందుపరచియున్నాడనుట కిక్రింది పద్యములు నిదర్శనములై యున్నవి.

ఉత్తరవంశము.

మ. అరిఁజూచున్ హరిసూచుసూచకములై ◆ యాదంద మందార కే
సరమాలామకరంద బిందుసలిల ◆ స్యందంబు లందంబులై
దొరగం బయ్యెద కొంగొకింత దొలఁగం ◆ దోట్తోశరాసారమున్
దరహాసామృతసారముం గురియుచుం ◆ దన్వంగి కేళీగతిన్.

దశమస్కంధము.

మ. పరుఁ జూచున్ పరుఁ జూచునొంప నలరిం ◆ పన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో ◆ వీరంబు శృంగారమున్
జరగం గన్నుల గెంపుసొంపు బరగం ◆ జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచుం ◆ జంద్రాస్య హేలాగతిన్.

నన్నయ తిక్కనాదుల శైలికిని పోతన శైలికిని భేదములు గానవచ్చుచున్నవి. నన్నయాదుల కవిత్వము వ్యాకరణప్రయోగప్రౌఢిమగల్గి యన్వయకాఠిన్యము గల్గియుండును. పోతనశైలియందు సులభమగు

నన్వయమును, బదలాలిత్యమును, శబ్దాలంకారచిత్రములును గలిగి యుండును. మరియు పోతనరచించిన పద్యములలో పాదాంతమునకును, విశ్రమస్థానమునకు పదములు సంపూర్తి జెందుచుండుటచే చదువుట కెంతయు ననుకూలముగా నుండును. ఈవిషయనిరూపణమునకై భారత భాగవతములనుండి యుదాహరణము లొసంగుచున్నాడను.

మాలిని.

ఏచితలిర్చి తనర్చిన క్రోవుల ♦ నిమ్మగుదావుల జొంపములం
బూచిన మంచియశోకములన్ సుర ♦ పొన్నలబొన్నల గేదగులం
గాచి బెడంగుగబండిన యాసహ ♦ కారములం గదళీతతులం
జూచుచు వీనులకింపెసగన్ వినుచున్ ♦ శుకకోకిలసుస్వరముల్.

కవిరాజవిరాజితము.

చనిచని ముందటనాజ్యహవిర్ధ్రుత ♦ సౌరభధూమలతాతతులం
బెనగినయాకుల కొమ్మలమీఁద న ♦ పేతలతాంతములైనను బా
యనిమధుపప్రకరంబులజూచి జ ♦ నాధిపుడంత నెఱింగెదపో
వనమిది యల్లదె దివ్యమునీంద్రని ♦ వాసము దానగు నంచు నెదన్.

సీ. "శ్రవణసుఖంబుగా ♦ సామగానంబులు
చదివెడు శుకముల ♦ చదువుదగిలి
కదలక వినుచుండు ♦ కరులయుగరికర
శీతలచ్ఛాయద ♦ చ్ఛీకరాంబు
కణములచల్లని ♦ గాడ్పాసపడివాని
జెంది సుఖంబున్న ♦ సింహములయు
భూసురప్రవరులు ♦ భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్న ♦ పిండతతులు
గడగి భక్షింపనొకకూట ♦ గలసియాడు
చున్న యెలుకలపిల్లుల ♦ యొండుసహజ
వైరసత్వంబులయు సహ ♦ వాస మపుడు
చూచిమునిశక్తి కెంతయు ♦ జోద్యమందె."

భారతము ఆదిపర్వమున అర కణ్వమహామున్యాశ్రమ వర్ణనము
భాగవతమున,

ఉ. "అందు దమాలసాలవకు ♦ ళార్జుననింబకదంబ పాటలీ
చందన నారికేళపన ♦ సారవిశేషలవంగలుంగమా
కందకుచందనక్రముక ♦ కాంచనబిల్వకపిత్థమల్లికా
కందమధూకమంజుళని ♦ కుంజములందలరారి వొండియున్."

క. "పరిపక్వఫలభరానత
తరుశాఖా నికరనివసి ♦ త స్ఫుటవిహంగో
త్కరబహుకోలాహలరవ
భరితదిగంతములు గలిగి ♦ భవ్యంబగుచున్.

క. అతినిశిత చంచుదళన
క్షతనిర్గత పక్వఫల ర ♦ స ప్రాశనమో
దితరాజశుకవచోర్ధ
శ్రుతిఘోషము చెలగుశ్రవణ ♦ సుఖదంబగుచున్."

క. "లలిత సహకారపల్లవ
కలితాస్వాదన కషాయ ♦ కంఠవిరాజ
త్కలకంఠ పంచమస్వర
కలనాదము లుల్ల సిల్ల ♦ గడు రమ్యములై."

క. "అతులతమాలమహీజ
ప్రతతీక్షణజాతజలద ♦ పరిశంకాంగీ
కృతతాండవ ఖేలనవిల
సితపింఛవిభాసిబాల ♦ శిఖిసేవ్యంబై."

తృతీయస్కంధము కర్దమాశ్రమవర్ణనము.

మరియు నీతఁడు భాగవతమును ఆంధ్రీకరించుచు నిట్లు నుడివి యున్నాఁడు.

క. కొందఱికిఁ దెనుఁగుగుణమగు
గొందఱికిని సంస్కృతంబు ♦ గుణమగు రెండున్
గొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల ♦ నయ్యైయెడలన్.

ఇట్లు వచించినయట్లు భాగవతమును రచించియుండెను. దశమ స్కంధమున శ్రీకృష్ణావతారఘట్టమును చదువునపుడు సాధారణముగా సుబోధకముగానుండును దానికివేరుగా నర్థమును వివరింపవలసిన పని యుండదు.

భాగవతమున నవరసములును నుచితరీతిని పోషింపబడియున్నవి జగన్మోహినావతారఘట్టము, గోపికావస్త్రాపహరణఘట్టము, రాసక్రీడ, మున్నగుతావులశృంగారరసము చిప్పిలుచుండును. నరసింహావతారఘట్టమున రౌద్రము మూర్తీభవించియుండుటను గనుగొనవచ్చును. ఇట్లే అయ్యెయెడల నాయారసములను బాగుగాపోషించి యున్నాడు.

పోతనవిరచితభాగములందు పద్యాంతము లతిమనోహరములై యుండును. ఇందులకుదాహరణములు.

క. కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి ♦ గణములపాలన్
గలడందు రన్నిదిశలను
గలడు గలండనెడువాడు ♦ కలడో లేడో.

భాగవత షష్ఠస్కంధము.

భాగవతములోని యితరభాగముల పూరించినవా రెవ్వరును అవలంబింపని పద్ధతులను సింగన యవలంబించియున్నాడు. ఈతడు తాను భాగవత షష్ఠస్కంధమును పూర్ణముగా దెనిగించుచుంటినని వక్కాణించియున్నాడు. ఏకాదశ ద్వాదశస్కంధములను పూరించినవెలిగందల నారాయణమున్నగువారు తాము సంపూర్ణముగా స్కంధమును రచించునప్పుడైనను యిట్లు వక్కాణించియున్నాడు. ఇందలి మొదటిపద్యము.

శా. శ్రీవత్సాంకితకౌస్తుభస్ఫురితల ♦ క్ష్మీచారువక్షస్స్థల
శ్రీవిభ్రాజితనీలవర్ణశుభరా ♦ జీవాక్షుగంజాతభూ
దేవేంద్రాది సమస్తదేవమకుటో ♦ ద్దీపోరురత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజునచ్యుతుగృపా ♦ వాసుం బ్రశంసించెదన్.

ఈపద్యమున నాతఁడు నారాయణుని యభినందించియున్నాఁడు. ఇంతియెగాక నితఁడు హయగ్రీవ స్తుతియును, గణపతిప్రార్థనము మున్నగువానిని గావించియున్నాఁడు. మరియు నితడు బమ్మెర పోతరాజు నిట్లభివర్ణించియున్నాఁడు.

ఉ. ఎమ్మెయి సెప్పనేల జగ ◊ మెన్నఁగ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు ◊ సూఱలు సేసిన వానిభక్తిలో
నమ్మినవాని భాగవత ◊ నైష్ఠికుఁడై తగువాని బేర్మితో
బమ్మెర పోతరాజకవి ◊ పట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.

ఈతఁడు తనకు దివ్యవాణి సాక్షాత్కరించినట్లుగా యీవిధంబున వక్కాణించియున్నాఁడు.

సీ. ఉరవడిఁ బ్రాగ్వీథి ◊ నుదయించు మార్తాండ
కోటి బింబచ్ఛాయ ◊ గూడినట్లు
హరిహరబ్రహ్మల ◊ యాత్మలలో నుబ్బి
కరుణ యొక్కట మూర్తి ◊ బెరసినట్లు
ఖరకరకరతీవ్ర ◊ గతిని గరంగుచు
హేమాద్రిచెంత బె ◊ ల్లగసినట్లు
ఫణిరాజఫణరాజి ◊ మణిగణవిస్ఫూర్తి
సుషిరంపు వెలిదల ◊ చూపినట్టు

తే. ఉట్టిపడ్డట్లు కట్టెఱ్ఱ ◊ నూదినట్లు
తేజమెసగంగ నామ్రోల ◊ దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సం ◊ పూర్ణదృష్టి
జూచి యిట్లనిపలికె మం ◊ జులముగాను.

ఈతఁడు యితరులవలెగాక తన వంశానుక్రమణికను గూడ యిట్లు వక్కాణించియున్నాఁడు.

సీ. శ్రీవత్సగోత్రుండు ◊ శివభక్తియుక్తుఁ డా
పస్తంబసూత్రుఁ డ ◊ పారగుణుఁడు
నేప్పూరిశాసనుం ◊ డెఱ్ఱన ప్రెగ్గడ
పుత్రుండు కేసన ◊ పుణ్యమూర్తి

కాత్మజుండగు నాగ ♦ యామాత్యునకుం గోల
మాంబకు సందను ♦ లమితయశులు
కసువనామాత్యుండు ♦ ఘనుఁడు వీరనమంత్రి
సింగన్నమణియు సం ♦ చితగుణాఢ్యు

తే. లుద్భవించిరి తేజంబు ♦ లూర్జితముగ
సొరిది మూర్తిత్రయంబన ♦ శుభ్రకీర్తి
బరగిరందులఁ గసువన ♦ ప్రభువునకును
ముమ్మడమ్మను సాధ్వి యి ♦ మ్ముల నువెలసె.

ఉ. ఆడదు భర్తమాట కెదు ♦ రాడదు వచ్చినవారి పేడగా
నాడదు పెక్కుభాష లెడ ♦ నాడదు వాకిలివెళ్లి కల్లమా
టాడదు మిన్నకేని సుగు ♦ ణావళి కిందిరగాక సాటియే
చేడియ లేదు చూరికుల ♦ శేఖరు స్వీయ ముమ్మడమ్మకున్.

క. ఆకసువయమంత్రికి బు
ణ్యాకల్పశుభాంగి ముమ్మ ♦ డమ్మయు మున్న
వ్యాకులచిత్తుల నిరువుర
శ్రీకరగుణగణుల బుణ్య ♦ శీలుర గాంచెన్.

క. అంగజసమలావణ్యా శు
భాంగులు హరి దివ్య ప ♦ దాంబుజ విలస
ద్భృంగాయమానచిత్తులు
సింగయ తెలగయలు మంత్రి ♦ శేఖరులనగన్.

క. అం దగ్రజుండు శివపూ
జం దనరినవాఁడ విష్ణు ♦ చరితామృత ని
ష్యంది పటువాగ్విలాసా
నందోచితమానసుండ ♦ నయకోవిదుడన్.

ఈతఁడు షష్ఠ్యంతములఁగూడ వ్రాసియున్నాఁడు.

క. శ్రీపతికి సత్పతికి నుత
గోపతికి త్రిలోకపతికి ♦ గురుజన బుధసం

తాపనివారణ మతికిని,
బ్రాపిత సనకాదితతికి ♦ బహుంతరధృతికిన్.

భాగవతము నశించినభాగమును పూరించినవారు భాగవతము లోని యుత్పన్న భాగముల పూరించినవారిలో సింగన పోతనకవిత్వగమ నికలను గమనించియే రచించియున్నాడని దోచుచున్నది. ఈక్రిందిపద్యము లీవిషయమును రూఢిసేయునవిగా నున్నవి.

క. పుణ్యంబై మునివల్లభ
గణ్యంబై కుసుమఫలని ♦ కాయోత్థితసా
ద్గుణ్యమయిన్నై మిశాఖ్యా
రణ్యంబు నుతింపదగు న ♦ రణ్యంబులలోన్. పోతన.

క. యాదంబై పరిదూషిత
ఖేదంబై శాబరీద్ధ ♦ కిలికించిత దృ
గ్భేదంబై బహుసౌఖ్యా
పాదంబై యొప్పువిద్య ♦ పాదంబునకున్. సింగన.

క. విడిచితి భవబంధంబుల
నడచితి మాయావిమోహ ♦ మైనతమంబున్
నొడిచితి నరివర్గంబుల
గడచితి నాజన్మదుఃఖ ♦ కర్మార్ణవముల్. పోతన.

క. పుట్టితివజు తనువునఁ జే
పట్టితివి పురాణపురుషు ♦ భజనముపదముల్
మెట్టితివి దిక్కులం దుది
ముట్టితివి మహాప్రబోధ ♦ మున మునినాథా. సింగన.

ఇతడును పోతనవలె షష్ఠస్కంధమును అద్వైతపరముగనే తెని గించెను. ఇందులకుదాహరణములు.

షష్ఠస్కంధము

1 సీ. అఖిలభూతముల దే ♦ హాంతస్థుఁడగునాత్మ
యీశుఁడచ్యుతుఁడని ♦ యెఱుఁగవలయు.

2 వ. దేవా! రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు ద్రవ్యాంత రంబుచేత బ్రహ్మంబైన నీయందు బ్రపంచభ్రాంతి గలిగెడిని.

3 వ. కావున గుణంబులును, గుణియును, భోక్తయును, భోగ్యంబును...హర్తయు హార్యంబును నుత్పత్తిస్థితిలయైక కర్తయై సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండె కాని యన్యంబు లేదు.

ఈతఁడును దనకు సహాయముగా శ్రీధరుల వ్యాఖ్యానమునే యూతగొనియున్నాఁడు. ఇతఁడు భాగవతములోని యితరభాగముల దెనిగించినవారికంటె నెక్కువవాడని చెప్పఁగనవచ్చును.

గంగన

ఈతఁడు పంచమస్కంధమును దెనిగించెను. ఈతనికవిత్వము సింగనకవిత్వముకంటె దక్కువయని జెప్పవచ్చును. అయినను యితని కవిత్వము లలితముగను సుకుమారముగను నుండును. ఇతఁడు మూల మును సరిగాననుసరింపలేదు. మూలమున నున్నదానిని చాలవరకు తగ్గించినట్లు గనబడుచున్నది. ఈతని యాంధ్రీకరణమున కుదాహర ణములు.

శ్లో॥ బాణావిమౌ భగవతశ్శతపత్రపత్రౌ కాంతావపుంఖరుచిరావతితిగ్మ దంతౌ । కస్మైన్నయుయుక్షంసివ నేవిహరన్న విద్మ క్షేమాయనోజడధి యాంతవలిక్రమోస్తు.

తెనుగు

క. పోలుపగుచున్న విలాసం
బుల నంగజుబాణములను బోలెడు నీచం
చల సత్కటాక్షవీక్షణ
ముల నెవ్వని నింతి! చిత్తమునఁ గలచెదవే.

ఈపద్యమున మూలమునందలి విశేషణములు పెక్కులు కాన రావు.

శ్లో॥ శిష్యా ఇమేభగవతః పరితః పఠంతి
గాయంతి సామ సరహస్యమజస్రమీశాః
యుష్మచ్ఛిఖావిలులతాస్సుమనోభివృష్టీః
సర్వేభజంత్యృషిగణా ఇవ వేదశాఖాః.

## తెలుఁగు

చ. చెదరగ వేదముల్ చదువ ♦ శిష్యులపైఁ దగ బుష్పవృష్టి స
మ్మదమున సంతతోఁ గురియు ♦ మాడ్కి నిమన్మథ సామగానముల్
చదివెడు శిష్యులో యనఁగ ♦ షట్పదపంక్తులు క్రమ్మియుఁగావడిం
బదపడి మీఁదరాలు గచ ♦ భారమునందుల జాఱుఁ గ్రొవ్విరుల్.

రెండవదానియందు మూలార్థకీలి గానుపించదు. పోతనాదుల కవిత్వమునందుగల స్వకపోలకల్పితములగు వర్ణనలు యీతని కవిత్వమున నెందును గానరావు. ఈతఁడును శ్రీధరులవారి వ్యాఖ్యానమునే సహాయముగా గొనియుండెను. మరియు నీతఁడీస్కంధమును నద్వైతపరముగనే దెనిగించెను.

## వెలిగందల నారయ

ఈతఁడు ఏకాదశద్వాదశస్కంధములను రచించెను. ఈ రెండు స్కంధములును మూలమునకు సరిగానుండక మిగుల సంక్షిప్తీకరింపబడినవి. కొన్నియెడల మూలమునందలి యభిప్రాయములకు విరుద్ధముగా గూడ నుండును.

ఏకాదశస్కంధమున త్రయోదశాధ్యాయమున శ్రీవిష్ణుండు హంసరూపియై చేసిన తత్త్వోపదేశము.

వస్తునోయదా నానాత్వమాత్మనః ప్రశ్న ఈశ్వరః అను శ్లోకములు గలవు. వానిని ఆంధ్రీకరించునెడల నైదారుపంక్తులవచనముతో వదలివైచెను.

ఈస్కంధమున సంస్కృతంబునగల భిక్షుతాదులు ఆంధ్రమునఁగా లేవు. మొత్తముమీఁద నీస్కంధమున నాలవపాలుమాత్రమే తెనిగింపబడినదని చెప్పవచ్చును. మఱియు నీరెండుస్కంధములును వ్రాతప్రతులు పరిశీలించిన నెందును అద్వైతపరముగా నాంధ్రీకరింపబడినట్లు దోపదు కాని యచ్చుప్రతులందు స్పష్టముగా నద్వైతపరముగా దెనిగింపబడినట్లు గాన్పించుచున్నది. వ్రాతప్రతుల పాఠములను గమనించితిమేని యవి రెండును విశిష్టాద్వైతపరముగా దెనిగింపబడినవనుట తెల్లము గాగలదు.

## పోతన-భాషాంతరీకరణము.

పోతన భాషాంతరీకరణము మెంతవఱకుమూలము ననుసరించి యున్నదో తెలుపుటకు మఱికొన్ని యుదాహరణము లిచ్చుచున్నాడను.

ఆత్మారామాశ్చమునయో నిర్గ్రంథా అప్యురుక్రమే
కుర్వంత్యహైతుకీంభక్తి మిత్థంభూతగుణో హరిః

క. ధీరులు నిరపేక్షులునా
త్మారాములు నైనమునులు ♦ హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు
నారాయణుడట్టివాడు ♦ నవ్యచరిత్రా.

శ్లో. నమః పరస్మై పురుషాయభూయసే
సదుద్భవస్థాననిరోధలీలయా
గృహీతశక్తి త్రితయాయదేహినా
మంతర్భవాయానుపలభ్య వర్త్మనే

మ. పరుడై యీశ్వరుడై మహామహిముడై ♦ ప్రాదుర్భవస్థానసం
హరణక్రీడనుడై త్రిశక్తియుతుడై ♦ యంతర్గతజ్యోతియై
పరమేష్ఠిప్రముఖామరాధిపులకుం ♦ బ్రాపింపరాకుండుదు
స్తరమార్గంబున దేజరిల్లుహరికిం ♦ దత్త్వార్థినై మ్రొక్కెదన్.

శ్లో. యత్కీర్తనం యత్స్మరణంయదీక్షణం
యద్వందనం యచ్ఛ్రవణం యదర్హణం
లోకస్య సద్యో విధునోతికల్మషం
తస్మైసుభద్రశ్రవసే నమోనమః

ఉ. ఏవిభువందనార్చనము ♦ లేవిభుచింతయునామకీర్తనం
బేవిభులీలలద్భుతము ♦ లెవ్వని సంశ్రవణంబుసేయ దో
షావళిబాసిలోకము శు ♦ భాయతవృత్తిజెలంగునంద్రునే
నావిభునాశ్రయించెదన ♦ ఘాఘునివృత్తిదుభద్రకీర్తిదున్.

శ్లో. ఏకస్స్వమాయోజగతస్సిసృక్షయా
ద్వితీయయాత్మన్యధి యోగమాయయా
సృజస్యదః పాసిపునర్గ్రసిష్యసే
యదోర్ణనాభిర్భగవన్ స్వశక్తిభిః

మ. అనఘా యొక్కఁడవయ్యు వాత్మకృతనానా యాజాతసత్త్వాదిశ
క్తిని కాయస్థితి నీజగజ్జననవృద్ధిక్షోభ హేతుప్రభా
వనిరూఢిం దగు చూర్ణనాభిగతివి శ్వస్తుత్యసత్త్వేశని
ఘనలీలామహిమార్ణవంబు గడపం గావచ్చునే యేరికిన్.

శ్లో. బిభర్షి కాయం ఎవానం సోద్యమో భోగవాన్యథా
విత్తం నేహోద్యయవతాం భోగోవిత్తవతాంనుహ
భోగినాంఖలు దేహోయం ఏవాభవతి నాన్యథా
న తేశయానస్యనిరుద్యమస్య బ్రహ్మన్నుహోర్థోయతఏవభోగాః
అభోగినోయం తవవిప్రదేహః ఏవాయత స్తద్వదనః క్షమం చేత్॥
కవిః కల్యోనిపుణదృక్చిత్రప్రియకథస్సమః
లోకస్యకుర్వతః కర్మశేషేతద్వీక్షితాపివా.

సీ. భూమినుద్యోగియై భోగియైయుండెడి
నరుని నెవడి ముని నాథనీవు
ఘనశరీరము దాల్చి కదలవు చిత్రము
ద్యమయుక్తునికిగాని ధనము లేదు
ధనవంతునకుగాని తగుభోగములు లేవు
భోగికిగాని సం పూర్ణమైన
తనువు లే దుద్యోగ ధనభోగములు లేక
నేలనూరక మేను నిద్రవోవు

ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమ దేహంబు
సముడ వార్యుడవువి శారదుడవు
బుద్ధినిధి లిజనుల బాగడవు తెగడవు
నిద్రప్రతిదినంబు నిలుపనేల.

శ్లో. యస్మాన్వాత్మనీదం నిజమాయయార్పితం
క్వచిద్విభాతం క్వచతత్తిరోహితం
అవిద్ధదృక్సాక్ష్యుభయం తదీక్షతే
సఆత్మమూలో వతుమాంపరాత్పరః॥

క. ఒకపరిజగములు వెలినిడి
యొకపరిలోపలికి గొనుచు ♦ నుభయముగనుచుం
సకలార్థసాక్షియగున
య్యకలంకుని నాత్మమూలు ♦ నర్థింతుమదిన్.

శ్లో. దిస్పృశుస్సోయస్యపద ॥ హి మంగళం
విముక్తిసంగాముసయస్సుసాధవః
చరంత్యలోకవ్రతమవ్రణాంవనే
భూతాత్మభూతాస్సుహృదస్సమేగతిః.

ఆ. ముక్తసంగులైన ♦ మునులుదిదృక్షులు
సర్వభూతహితులు ♦ సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యు ♦ లై కొల్తు రెవ్వని
దివ్యపదమువాడు ♦ దిక్కు నాకు.

శ్లో. కస్యాంశ్చిత్పూతనాయంత్యాం కృష్ణాయంత్యపిబత్తనం
తోకయిత్వారుదంత్యన్యాపదాహంచ్ఛకటాయతీం
దైత్యయిత్వాజహారాన్యా మేకా కృష్ణార్భభావనాం
కృష్ణరామాయితే ద్వేతుగోపవత్సాయితాః పరాః
వత్సయితాన్ గృహీత్వాన్యాభ్రామయిత్వావ్యపాతయత్
కృష్ణాయితాజఘానాన్యాతత్రైకాంతుబకాయితాం
ఆహూయ దూరగాయద్వత్కృష్ణస్తమనుకుర్వతీం.

సీ. పూతనయైయొక్క ♦ పొలతిచరింపంగ
శౌరియైయొకకాంత ♦ చన్నుగుడుచు
బాలుడై యొకభామ ♦ పాలకునేడ్చుచో
బండినేనను లేమ ♦ బాఱదన్ను
సుడిగాలి ననియొక ♦ సుందరిగొనిపోవ
హరిననివర్తించు ♦ నబ్జముఖియు
బకుడనేనని యొక్క ♦ పడతిసంరంభింప
పద్మాక్షుడను కొమ్మ ♦ పరిభవించు

ఆ. నెలమిరామకృష్ణు ♦ లింతు లిద్దఱుగాగ
గోపవత్సగణము ♦ గొందఱగుదు

రసురవైరినను చు ♦ నబలయొక్క_నెచీరు
బసులమనెడి సతుల ♦ భరితముఖ్య.

శ్లో॥ జయతి తేధికంజన్మనా వ్రజ
శ్రయతయింది రా శశ్వదత్రహి
దయిత దృశ్యతాందిక్షుతావ కా
స్త్వయిధృతాసవస్త్వాం విచిన్వతే.

క. నీవు జనించు కతమున
నోవల్లభలక్ష్మిమంద ♦ నొప్పెనధికమై
నీవెంటనె ప్రాణములిడి
నీవారరిసెదరు చూపు ♦ నీరూపంబున్.

శ్లో. శరదుదాశయే సాధుజాతస
త్సరసిజోదర శ్రీముృషాదృశా
సర తనాధతే శుల్క దాసికా
వరదనిఘ్నతో నేహకిం వధః.

క. శారదకమలోదరరుచి
చోరకమగు చూపువలన ♦ సుందరమమ్మిం
గోరివెల యీనిదాసుల
ధీరతనొప్పించుటిది వ ♦ ధించుటగాదే,

శ్లో. ప్రణతదేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనం
ఫణిఫణార్పణం తేపదాంబుజం
కృణుకుచేషునః కృంధిహృచ్ఛయం.

ఉ. గోవులవెంట ద్రిమ్మరుచు ♦ గొల్చినవారలపాపసంఘముల్
ద్రోవగజాలిశ్రీదనరి ♦ దుష్టభుజంగఫణాలతాగ్రసం
భావితమైననీ చరణ ♦ పద్మము చన్నులమీద మోపితి
ద్భావజపుష్పభల్లభవ ♦ బాధహరింపు వరింపుమాధవా.

పోతన - వర్ణనములు

ఒకచో వర్ణించినవిషయమునే వర్ణించునెడల పోతనయుత్తరోత్తరమెక్కుడు రసవంతముగా నుండునట్లు వర్ణించును.

ఉ. అందు దమాలసాలవకు ♦ ళార్జున నింబకదంబపాటలీ
చందన నారికేళఘన ♦ సారశింప లవంగలుంగ మా
కందకుచందనక్రముక ♦ కాంచనబిల్వకపిత్థమల్లికా
కుందమధూక మంజులలి ♦ కుంజములందనరారె వెండియున్.

క. పరిపక్వఫలభరానత
తరుశాఖానికరవసి ♦ తస్ఫుటవిహగో
త్కర బహుకోలాహలరవ
భరితదిగంతములు గలిగి ♦ భవ్యంబగుచున్.

క. అతినిశిత చంచుదళన
క్షతనిర్గత పక్వఫల రసా ♦ స్వాదనమో
దితరాజశుకవచోర్థ
శ్రుతిఘోషము సెలగశ్రవణ ♦ సుఖదంబగుచున్.

క. లలిత సహకారపల్లవ
కలితాస్వాదన కషాయ ♦ కంఠవిరాజ
త్కలకంఠ పంచమస్వర
కలనాదములుల్లసిల్ల ♦ గడురమ్యములై.

క. అతుల తమాలమహీజ
ప్రతతి క్షణజాతజలద ♦ పరిశంకాంగీ
కృతతాండవఖేలనవిల
సితపింఛవిభాసి బాల ♦ శిఖిసేవ్యంబై.

క. కారండవజలకుక్కుట
సారసబకచక్రవాక ♦ షట్పదహంసాం
భోరుహకైరవ నవక
ల్హారవిరాజిత సరోరు ♦ హాకరయుతమై.

క. కరిపుండరీకవృకకా
సరశశభల్లూక హరిణ ♦ చమరీహరిసూ
కరఖడ్గగవయవలిముఖ
శరభప్రముఖోగ్రవన్య ♦ సత్వాశ్రయమై.

తృతీయస్కంధమున జెప్పబడిన యీవర్ణనమును మార్చి పెంచి అష్టమస్కంధమున గజేంద్రమోక్షమున త్రికూటమునందలి మహారణ్యము వర్ణించు వచనమున పెంపొందించియున్నాడు. ఆవచనమంతయు నిచ్చట నొసంగిన గ్రంథవిస్తరమగునను తలంపున విరమింపబడియెను.

## పోతన - అంత్యానుప్రాసము.

పోతనయంత్యప్రాసమును మెక్కువగా వాడియున్నాడు. క్రియతోనే పద్యము ప్రారంభమైనను యది చక్కని యంత్యప్రాసముతో నలరారుచు చదువుటకు శ్రావ్యముగ మాటలగట్టుచుండును. ఉదాహరణముగా గొన్నిపద్యముల నొసంగుచున్నాడను.

శా. పూరించెన్ హరిపాంచజన్యము గృపాం ♦ భోరాశి సౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృత మహా ♦ భూతప్రచైతన్యమున్
సారోదారశితప్రభాచకిత ప ♦ ర్జన్యాది రాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును ని ♦ ర్ధూతద్విషత్సైన్యమున్.

మ. అటకాంచెం గరిణీవిభుండు నవఫు ♦ ల్లాంభోజకల్హారమున్
నటదిందీవరవారముం గమఠమీ ♦ నగ్రాహదుర్వారమున్
వటహింతాలరసాలసాలసుమనో ♦ వల్లీకుటీతీరముం
జటులోద్ధూతమరాళచక్రబకసం ♦ చారంబు గాసారమున్.

మ. కరుణాసింధుడు శౌరివారిచరమున్ ♦ ఖండింపగాబంపె స
త్వరితాకంపిత భూమిచక్రము మహో ♦ ద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ ♦ బ్రహ్మాండభాండచ్ఛటాం
తర నిర్వక్రము భావితాఖిలసుధాం ♦ ధశ్చక్రముం జక్రమున్.

మ. కని రారాజకుమారికల్ పరిమళ ♦ కౌతూహలాక్రాంతలై
దనుజాధీశచమూవిదారు నతనుం ♦ దారున్ శుభాకారు నూ
తనశృంగారు వికారదూరుసుగుణో ♦ దారున్ మృగీలాంచనా
జనచేతోధనచోరు రత్నమకుట ♦ స్ఫారున్ మనోహారునిన్.

మ. కనెనక్రూరుడు పద్మనేత్రులను రం ♦ గద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతులన్నలంకృతులను ♦ ద్యద్భానులం బీతస

లసదీనజ్వలవాసులం గుసుమమా ♦ లాధారులన్ ధీరులన్.
వనితాకాముల గృష్ణరాముల జగ ♦ ద్వంద్యక్రమోద్దాములన్.

మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహా ♦ సౌధాగ్రభృంగారకం
గళహంసావతిహేమపద్మపరిఖా ♦ కాసారకం గోకిలా
వళిసంభాషితతోరకం దరులతా ♦ వర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకురకోరకం మణిమయ ♦ ప్రాకారకం ద్వారకన్.

మ. దివిజానీకవిరోధి ద్రొక్కఁగని వా ♦ ర్ధీశానసంకేతకున్
సవిశేషోత్సవసంవిధాతకు సమ ♦ స్తత్రాతకున్ సత్తపో
నివహాభీష్టవరప్రదాతకు జగ ♦ న్నిర్మాతకున్ దాతకున్
వివిధప్రాణిలలాటలేఖనమహా ♦ విద్యానుసంధాతకున్.

క. కనియెన్ నారదుఁ డంతన్
వినయైకవిలాసు, నిగమ ♦ విభజనవిద్యా
జనితోల్లాసున్ భవదుః
ఖనిరాసున్ గురుమనోవి ♦ కాసున్ వ్యాసున్.

మ. కనియెన్ గృష్ణుఁడు సాధునీరము, మహా ♦ గంభీరముం బద్మకో
కనదాస్వాదవినోదమోదమదభృం ♦ గద్వంద్వఝంకారమున్
ఘనకల్లోలలతావితానవిహర ♦ త్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము, మందవాయుజకణా ♦ సారంబు కాసారమున్.

మ. నవరత్నార్థము తండ్రి వంపఁ జని వి ♦ శ్వామిత్రుఁడుం దోడరా
నవలీలం దునుమాడె రాముఁ డదయుం ♦ డై బాలుఁడై కుంతల
చ్ఛవిసంతర్జితహాటకం, గపటభా ♦ షావిస్ఫురన్నాటకన్
జవభగ్నార్యమఘోటకం, గిరవిరా ♦ జత్ఖేటకం దాటకన్.

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట ♦ బోయి ముదమ్మునఁ గాంచె దండకా
రణ్యము దాపసోత్తమశ ♦ రణ్యము, నుద్ధతబర్హిబర్హలా
వణ్యము, గౌతమీవిమల ♦ వాఃకణపర్యటనప్రభూతసా
గ్గుణ్యము, నుల్లసత్తరువి ♦ కుంజవరేణ్యము సత్వగణ్యమున్.

ఉత్తరహరివంశమున ఎఱ్ఱాప్రగడ ఈ అలంకారమును వాడి యున్నాడు.

క. శ్రీమంతులంతగాంచిరి
గోమంతము విపినకుసుమ ♦ కుంచితశబరీ
సీమంతము నిర్ఝరకణ
హేమంతము గనకమ ♦ హీమంతంబున్.

క. చాపశరీరస్ఫూర్తిజిత
శారదనీరదనిభ దీప్తి ♦ శారదుడు భవో
త్తారకుడాశ్రితతతికి
నారదుడు తదీయగృహము ♦ కు నేతెంచెన్

ఈ అలంకారమునే అనేకవిధములుగా మార్చి పోతన వాడియు
న్నాడు.

క. భూషణములు సెవులకు నఘ
శోషణములు మృత్యుచిత్త ♦ భీషణములు హృ
త్తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోప ♦ చితభాషణముల్.

క. పావనములు దురితలతా
లావనములు నిత్యమంగ ♦ ళ ప్రాభవసం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవ ♦ పద సేవనముల్.

క. మంతనములు సద్గతులకు
బొంతనములు ఘనములైన ♦ పుణ్యములకిదా
నింతనపూర్వమహాఘుని
కృంతనములు రామనామ ♦ కృత చింతనముల్.

క. ధృతిచెడిలోబడుమల్లుం
డతులిత భవజలధితరికి ♦ హాతరిపుపురికిన్
హితకరికిన్ ధృతగిరికిం
దతహారరవభరితశిఖరి ♦ దరికిన్ హరికిన్.

క. స్ఫురితవిబుధజనముఖములు
పరివిదళితదనుజనివహ ♦ పతితనుముఖముల్

గురురుచి జితశిఖిశిఖముల
నరహరినఖములు లనుదు ♦ నతజనసఖముల్.

చ. చనిచనికాంచిరంత బుధ ♦ సత్తములంచితనిత్యశో
భనవిభవాభిరామము బ్ర ♦ పన్నజనస్తవనీయనామమున్
జననవిరామ మార్యజన ♦ సన్నుతభూమియు భక్తలోకపా
లనగుణధామముం బుధల ♦ లామముజానువికుంఠధామమున్.

చ. మనమున మోదమందుచును ♦ మారమణీమణిగాంచె జారుమృ
త్కనకకుశాజినాయసని ♦ కాయవినిర్మితపాత్రసీమము
న్ననుపమవేదఘోష సుమ ♦ నాత్మనుబంధనకర్మభూమియున్
మునివిబుధాభిరామము స ♦ ముజ్జ్వలహోమము యజ్ఞధామమున్.

ఉ. భాసురలీలగాంచిరి సు ♦ పర్వులు భక్తజనైకమానసో
ల్లాసము గిన్నరీజనవి ♦ లాసము నిత్యవిభూతి మంగళా
వాసము సిద్ధగుహ్యకని ♦ వాసము జాగువిరాజమానకై
లాసము గాంతినిర్జితకు ♦ లక్షితిభృత్సుమహాద్విభాసమున్.

గీర్వాణపదముల భూయిష్ఠము-సప్తమస్కంధము

క. అడిగెదనని కడువడిజను
నడిగినదనుమగుడనుడువ ♦ డనినడయుడుగున్
వెడవెడ సిడిముడిదడబడ
నడుగిడు నడుగిడదుజడిమ ♦ నడుగిడునెడలన్.

క. నిగమములు వేయిచదివిన
సుగమంబులుగావు, ముక్తి ♦ శుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింపముక్తి ♦ నివసనముబుధా.

సింగనగూడ నీయలంకారమును అనుసరించి యున్నాడు.

మ. కనిమెన్ బ్రాహ్మణు డంత్యకాలమున వీ ♦ కన్ రోషనిష్ఠ్యూతులన్
ఘనపీనోష్ఠవికారవక్త్రవిలస ♦ ద్గర్వేక్షణోపేతులన్
జనసంత్రాసకరోద్యతాయతసుపా ♦ శశ్రేణికాహేతులన్
హననవ్యాప్తి విభీతులన్ మువురనా ♦ త్మానేతలన్ దూతలన్.

శా. హాలాఘూర్ణిత నేత్రుతో మదనతో ◆ ప్రారంభసంరంభుతో
ఖేలాపాంగ సయోగ్య భూరివిభవతో ◆ గీర్ణాలకాజాలతా
హేలాలింగన భంగి వేపవతితో ◆ నిచ్ఛవతీమూర్తితో
సాలిందేలుచు నున్నవానిగనె బుం ◆ ఖీభూతరోమాంచుడై.

ప్రథమస్కంధము - పోతన

మ. త్రిజగన్మోహన నీలకాంతితనువు ◆ ద్దీపింప బ్రాభాతనీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ ◆ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్తముఖారవిందమతి సే ◆ వ్యంబై విజృంభింపమా
విజయుం జేరెడు వన్నెలాడు మది నా ◆ వేశించు నెల్లప్పుడున్.

మ. హయరింఖాముఖధూళి ధూసర పరి ◆ న్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై ◆ రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చు వేడ్కనని నా ◆ శస్త్రాహతిం జాల నొ
చ్చియు బోధించుమహానుభావు మదిలో ◆ జింతింతునశ్రాంతమున్.

మ. నరుమాటల్ విని నవ్వుతో నుభయసే ◆ నామధ్యక్షోణిలో
బరువీక్షింప రథంబునిల్పి పరభూ ◆ పాలావళిం జూపుచుం
బరభూపాయువులెల్ల జూపులన శుం ◆ భత్కేలివంచించునీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృ ◆ త్పద్మాసనాసీనుడై.

క. తనవారిజంపజాలక
వెనకకుబోనిచ్చగించు ◆ విజయునిశంకన్
ఘనయోగవిద్య బాపిన
మునివంద్యుని పాదభక్తి ◆ మొనయున్ నాకున్.

సీ. కుప్పించియెగసిన ◆ గుండలంబులకాంతి
గగనభాగంబెల్ల ◆ గప్పికొనగ
నుఱికిననోర్వక ◆ యుదరంబులోనున్న
జగముల వ్రేగున ◆ జగతిగదల
జక్రంబు జేపట్టి ◆ చనుదెంచు రయమున
బైనున్న పచ్చని ◆ పటముజార
నమ్మితి నాలావు ◆ నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి ◆ మరలదిగువ

తే. గరికిలంఘించు సింహంబు ♦ కరణిమెఱసి
నేడుభీష్ముని జంపుదు ♦ నిన్నుగాతు
విడువుమర్జున యనుచు మ ♦ ద్విశిఖవృష్టి
దెరలిచనుదెంచు దేవుండు ♦ దిక్కునాకు.

మ. తనకున్ భృత్యుడు వీసిగానుటమహా ♦ ధర్మంబువోమ్మంచు న
ర్జునుసారథ్యము పూనిపగ్గములు చే ♦ జోద్యంబుగాబట్టుచున్
మునికోలన్ వడిబూన్చి ఘోటకములన్ ♦ మోదించి తాడించుచున్
జనులన్ మోహమునొందజేయుపరమో♦త్సాహుల్ బ్రశంసించెదన్

క. పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల ♦ నాభీరవధూ
కులముల మనములతాలిమి
కొలుకులు వదలించుఘనుని ♦ గొలిచెదమదిలోన్.

ఆ. మునులు నృపులుజూడ ♦ మునుధర్మజునిసభా
మందిరమున యాగ ♦ మంటపమున
జిత్రమహిమతోడ ♦ జెలువొందుజగదాది
దేవుడమరు నాదు ♦ దృష్టియందు.

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకు దా ♦ నొక్కొక్కడైతోచు పో
లికనేదేవుడు సర్వకాలముమహా ♦ లీలన్ నిజోత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ ♦ నానావిధానూనరూ
పకుడై యొప్పుచునుండునట్టి హరినే ♦ ప్రార్థింతుశుద్ధాండనై.

షష్ఠస్కంధము—సింగన.

సీ. బ్రహ్మహత్యానేక ♦ పాపాటవులకగ్ని
కీలలు హరినామ ♦ కీర్తనములు
గురుతల్పకల్మష ♦ క్రూరసర్పములకు
గేకులు హరినామ ♦ కీర్తనములు
తపనీయచౌర్యాఘ ♦ తమసంబునకుసూర్య
కిరణముల్ హరినామ ♦ కీర్తనములు

మధుపానకిల్బిష ♦ మదనాగసమితికి
కేసరుల్ హరినామ ♦ కీర్తనములు

తే. మహితయోగోగ్రనిత్యస ♦ మాధినిధుల
సలకుబ్రహ్మాది సురులకు ♦ నందరాని
భూరినిర్వాణసామ్రాజ్య ♦ భోగభాగ్య
ఫలనంబులు హరినామ ♦ కీర్తనములు.

సీ. ముక్తికాంతా కాంత ♦ మోహనకృత్యముల్
గలిమై హరినామ ♦ కీర్తనములు
సత్యలోకానంద ♦ సౌభాగ్యయుక్తముల్
గలిమై హరినామ ♦ కీర్తనములు
మహితనిర్వాణసా ♦ మ్రాజ్యభిషిక్తముల్
గలిమై హరినామ ♦ కీర్తనములు
బహుకాల జనిత తీ ♦ వ్రాఘ సారతముల్
గలిమై హరినామ ♦ కీర్తనములు.

తే. పుణ్యమూలంబు లనపాయ ♦ పోషకంబు,
లభిమతార్థంబు లజ్ఞాన ♦ హరణకరము
లాగమాంతోపలబ్ధంబు ♦ లమృతసేవ
లార్త శుభములు హరినామ ♦ కీర్తనములు.

దశమస్కంధము — ఉత్తరభాగము.
పోతన

సీ. కుచకుంభములమీది ♦ కుంకుమతోరాయు
హారంబులగుణంబు ♦ లగుచుమెఱయఁ
గరపల్లవముజూచి ♦ కదలింపసంగుళీ
యాకకంకణప్రభ ♦ లావరింపఁ
గదలినబహురత్న ♦ కలితనూపురములు
గంభీరనినదంబు ♦ గడలుకొనఁగఁ
గాంచన మణికర్ణి ♦ కామయూఖంబులు
గండపాలికలపై ♦ గంతులిడఁగఁ

తే. గురులున ర్తింపఁబయ్యెద ♦ కొంగుదూగ
జోటిచేనున్న చామర ♦ పుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి ♦ చేరనరిగి
వేడ్కలిగురొ త్తమెల్లన ♦ వీవదొడఁగె.

వ. అప్పుడు.

మ. పతి యేరూపముదాల్చినం దదనురూ ♦ పంబైన రూపంబుతో
సతి తానుండెడు నట్టిరూపవతి నా ♦ చంద్రాస్యనాలక్ష్మి నా
సుతనున్ రుక్మిణి నాయనన్యమతి నా ♦ శుద్ధాంతరంగంగళా
చతురత్వంబున శౌరియిట్లనియె జం ♦ చన్మందహాసంబుతోన్.

మ. బలశౌర్యంబుల భోగమూర్తి కులరూ ♦ పత్యాగసంపద్గుణం
బుల దిక్పాలురకంటె జైద్యముఖరుల్ ♦ పూర్ణుల్ ఘనుల్ వారికిన్
నెలతా తల్లియు దండ్రియున్ సహజుఁడున్ ♦ నిన్నిచ్చినంజోక యీ
బలవద్వైరుల వార్ధిలీనుల మముం ♦ బాటింపనీ కేటికిన్.

సీ. లోకుల నడవడి ♦ లోనివారముగాము
పరులకు మాజాడ ♦ బయటపడదు
బలమదోపేతులు ♦ పగగొండ్రుమమ్మాతోడ
రాజపీఠములకు ♦ రాముతలఁచు
శరణంబుగాకుని ♦ జలరాశిసతతంబు
నిష్కించనులమేము ♦ నిధులులేవు
కలవారు చుట్టాలు ♦ గారు నిష్కించన
జనబంధులము ముక్త ♦ సంగ్రహాలము

ఆ. గూఢవర్తనులము ♦ గుణహీనులముభిక్షు
లైనవారినిగాని ♦ యాశ్రయింప
మిందుముఖులు దగుల ♦ రిటువంటి మముబోటి
వారినేలదగుల ♦ వారిజాక్షి.

క. సిరియును వంశముఁరూపును
సరియైన వివాహసఖ్య ♦ సంబంధంబుల

జరుగును సరికాకున్నను
జరుగవు లోలాక్షి యెట్టి ♦ సంసారులకున్.

క. తగదని యెఱుగవు మమ్మున్
దగిలితివి మృగాక్షి దీన ♦ దప్పగు నీకుం
దగిన మనుజేంద్రు నొక్కని
దగులుము గుణహీనజనుల ♦ దగునే తగులన్.

చ. అలికులవేణి తన్ను బ్రియు ♦ డాడిన యప్రియభాషలిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల ♦ సూదులు సొల్పిన కతిగాగ బె
బ్బులిరొదవిన్న లేడి క్రియ ♦ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై
వలనఱి వ్రాలె గీలెడలి ♦ వ్రాలినపు త్తడిబొమ్మకైవడిన్.

వ. ఇట్లు వ్రాలిన.

మ. ప్రణతామ్నాయుడు కృష్ణుడంతగదిసెన్ ♦ బాష్పావరుద్ధారుణే
క్షణవిస్రస్తవినూత్న భూషణదురు ♦ క్తక్రూరనారాచ శో
షణనాలింగితధారుణిన్ నిజకులా ♦ చారైక సద్ధర్మచా
రిణి విశ్లేషిణి వీతతోషిణి బురం ♦ ధ్రీగ్రామణిన్ రుక్మిణిన్.

సీ. కనిసంభ్రమంబున ♦ దనువునందనువుగా
నను వున జందనం ♦ బల్లనలది
పన్నీరు పన్నీట ♦ గడిగి కర్పూరంపు
బలుకులు చెవులలో ♦ బాఱనూది
కరమొప్పు ముత్యాల ♦ సరులచిక్కెడలించి
యురమున బొందుగా ♦ నిరువుకొలిపి
తిలకంబు నునుఫాల ♦ ఫలకంబుపై దీర్చి
వదలిన భూషణా ♦ వలులు దొడిగి

తే. కమలదళచారుతాలవృంతములవిసరి
సొలుచు పయ్యెదగుచముల ♦ బొందు పఱచి
చిత్తమిగురొత్తనొయ్యన ♦ సేద దేర్చి
బిగియ కౌగిట జేర్చి నె ♦ మ్మొగము నిమిరి.

సీ. నీరదాగమమేఘ ♦ నిర్యత్పయఃపాన
చాతకంబే గునే ♦ చౌటిపడెకు

బరిపక్వమాకంద ♦ ఫలరసంబులుగ్రోలు
కీరంబుచనునె మ ♦ ధూరములకు
ఘనరవాకర్ణనో ♦ త్కలికమయూరము
కోరునేకతినఝు ♦ ల్లీరవంబు
గరికుంభపిశితస ♦ ద్గ్రాసమోదితసింహ
మరుగునే శునకమాం ♦ సాభిలాష

తే. ప్రబవిమలాకార భవదీయ ♦ పాదపద్మ
యుగసమాశ్రయనైపుణో ♦ ద్యోగచిత్త
మన్యుజేరునె తనకుసా ♦ ధ్యంబుగాగ
భక్తమందార దుర్భవ ♦ భయవిదూర

పంచమస్కంధము—గంగన.

సీ. ధరణీశమాయచే ♦ తనుదాటగారాని
పదమునబెట్టంగ ♦ బద్ధజీవుఁ
డెలమినైగుణకర్మ ♦ ములజేయుచునులాభ
మాశించిచతిరుగుచే ♦ హారిమాండ్క
ఫలమపేక్షించుచు ♦ బాయకజీవుండు
సంసారగగన సం ♦ చారియగుచు
ననవరతమునుండు ♦ నామహావనమందు
కామలోభాదిత ♦ స్కరులుగూడి

తే. ధరణివిజితేంద్రియుఁడుగాని ♦ నరునిబట్టి
ధర్మమనియెడి యామహా ♦ ధనమునెల్ల
నరసికొనిపోవుచుందురు ♦ రనుచనంబు
గాన సంసారమందు నా ♦ కాంక్షవలదు.

క. అరయగ సంసారాటవి
దరలకయాపుత్రమిత్ర ♦ దారాదులనం
బరగుచునుండెడు వృకములు
పరువడినస్తములను ♦ భక్షించువడిన్

తరలము. మానిసిసంసృతిఘోరకానన ♦ మందిరంబులనెల్ల వో
జెలగిగుల్మలతాతృణావళి ♦ చేతగహ్వరమైన ని
శ్చలనికుంజములందు మూర్ఛన ♦ సంజ్ఞలంగలమక్షికం
బులనిరోధము దన్ను బోకిన ♦ బొందునీదుర్దశ నెప్పుడున్.

ఆ. మఱియునీగృహస్థ ♦ మార్గంబునందెల్ల
విషయములనుబొంది ♦ విశ్వమెల్ల
గడకతోడనిట్లు ♦ గంధర్వనగరంబు
గాదలంచిమిగుల ♦ మోదమందు.

ఆ. మరగికాననమున ♦ గొఱవిదయ్యముగాంచి
యగ్నిగోరి వెంట ♦ నరుగుమాడ్కి
గాంచనంబుగోరి ♦ కలవారియిండ్ల పం
చలనుదిరుగునరుడు ♦ చలనమందు.

ఆ. బహుకుటుంబియగుచు ♦ బహుధనాపేక్షచే
నెండమావులగని ♦ యేగుమృగము
కరణిబ్రేమజేసి ♦ గుడువులువారుచు
నొక్కచోటనిలువ ♦ కుండునెపుడు.

ఆ. మఱియునొక్కచోట ♦ మత్తుడైపవనర
జోహతాక్షుడగుచు ♦ జూపుదప్పి
దిక్కెఱుంగ కొందు ♦ దిశకేగుపురుషుని
కరణిదిరుగునరుడు ♦ నరవరేణ్య.

వీరభద్రవిజయము.

సీ. కమలషండమునున్న ♦ గాజేసి యిరుసుగా
గావించి కెందమ్మి ♦ కండ్లుగూర్చి
తగనించుమోసుల ♦ నొగలుగాగావించి
కరమొప్పు గేదంగి ♦ కాడిపెట్టి
సంపెంగమొగ్గల ♦ చనుగొయ్యలొనరించి
పల్లవంబులుమీద ♦ బరపుజేసి
చెలువైనపొగడదం ♦ డలచేతబిగియించి
మెలదీగపలుపులు ♦ లీలజొనిపి

తెఱగు లరసి పువ్వు ♦ తేనెకందెనవెట్టి
గండురాజకీర ♦ గముఁలగట్టి
మెఱయ చిగురుగొడుగుమీను ♦ టెక్కెము గ్రాల
దేరుబన్ని సురభి ♦ తెచ్చెనపుడు.

సీ. ఖద్యోతబృందంబు ♦ గల్పింపవచ్చునే
పరగ తేజోప్రదీ ♦ పంబుమీద
బరగ దేజోప్రదీ ♦ పంబుశోభించునే
యఖిలంపుఘోర దా ♦ వాగ్నిమీద
నఖిలంపుఘోర దా ♦ వాగ్ని పెంపేర్చునే
పవలింటిభానుబిం ♦ బంబుమీద
బవలింటిభాను బిం ♦ బంబు వెలుంగునే
ప్రళయకాలానల ♦ ప్రభలమీద
ప్రబలయకాలాగ్నికోటిచే ♦ ప్రజ్వరిల్లు
మంటగలకంటిమేటి ము ♦ క్కంటిమీద
ప్రాలనేరదు నీపంపు ♦ చాలుగాని
జితజగజ్జనసంఘాత ♦ చిత్తజాత.

మ. బలభేద్యాది సురారికిం బలుకు నా ♦ పంతంబు జెల్లింతు ను
త్పలగంధిన్ దగబొందు శూలి యతడీ ♦ బ్రహ్మాండ భాండావళుల్
గలుగంజేయు సదాశివుండని మెఱుం ♦ గంజాలుదున్ జాలునే
కలకంఠీరవకంబుకంఠి! శివు వ ♦ క్కాణింప నింకేటికిన్.

శా. ఏరా దక్ష! యదక్షమానస! వృథా ♦ యీదూషణంబేలరా?
యోరీ! పాపములెల్ల బోవిడువరా ♦ యుగ్రాక్షుజేపట్టరా
వైరంబొప్పదురా శివుందలపరా ♦ వర్ణింపరా రాజితో
త్కారాత్ముండగు నీలకంఠు దెగడం ♦ గారాదురా దుర్మతీ.

సీ. కలయనీరేడు లో ♦ కముల దొంతులతోడ
బాగొప్ప మూడురూ ♦ పములతోడ
మూడుమంత్రములతో ♦ మూడుకాలములతో
భ్రమియించు పుణ్యపా ♦ పములతోడ

సలలితఖేచరా ♦ చరజంతుకోటితో
భూరితేజంబుతో ♦ భూతితోడ
జంద్రానలావనీ ♦ జలవాయుగగనాత్మ
తరులతో మఱియు జి ♦ త్తములతోడ
భర్గదేవుమహిమ ♦ బ్రహ్మాండములు సేయు
గాచు నడచుగాని ♦ కానరాదు
నిఖిలమెల్ల దాన ♦ నీవును నేనును
దానకాన నింద ♦ తగదు సేయ.

ఉ. ఒండొరుమందరాంబువుల ♦ నోలిమునింగియు కుప్పతెప్పలై
యొండొరు బాయలేకునికి ♦ నున్మదులై నిజబోధవిస్ఫు నొం
డొండన దెప్పలై గుణగ ♦ జోన్నతి కూటమిజేర్చి శంభుడా
కొండలరాజుకూతునకు ♦ గూరిమి నిట్లనియెన్ బ్రసన్నుడై.

శా. ఓ వామేక్షణ ! యో కురంగనయనా! ♦ యోకాంత! నీయిష్టమై
నీవా నన్నును నేలుకొంటివి సతీ! ♦ నీవాడ నేనైతినిన్
బోవ ద్దండుము నందినెక్కి వడిస ♦ మ్మోదంబుగా బ్రీతితో
రావే పోదము వెండికొండకు మనో ♦ రాగంబుతో కన్యకా.

భాగవతము-భీభత్సము

శా. ఇంతింతై వటు డింతయైమఱియు దా ♦ నింతైనభోవీధిపై
నంతై తోయదమండలాగ్రమున క ♦ ల్లంతై ప్రభారాశిపై
నంతైచంద్రుని కంతయైధ్రువునిపై ♦ నంతైమహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్ర ♦ హ్మాండాంతసంవర్ధియై.

మ. రవిబింబం బుపమింపబాత్రమగు ఛ ♦ త్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై ♦ సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలినుదం ♦ చద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దా ♦ బ్రహ్మాండమున్ నిండుచున్.

భాగవతము-భక్తి

శా. అంధేందూదయముల్ మహాబధిరశం ♦ ఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూ ♦ కాంక్షల్ గృతఘ్నావలీ

బంధుత్వంబులు భస్మహావ్యములు లు ♦ బ్భద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల రి ♦ క్తవ్యర్థసంసారముల్.

సీ. కమలాక్షునర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథువర్ణించు ♦ జిహ్వజిహ్వ
సురరక్షకునిజూచు ♦ చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ♦ శిరము శిరము
విష్ణునాకర్ణించు ♦ వీనులు వీనులు
మధువైరిదవిలిన ♦ మనము మనము
భగవంతు వలగొను ♦ పదములు పదములు
పురుషోత్తమునిమీఁది ♦ బుద్ధి బుద్ధి

తే. దేవదేవుని జింతించు ♦ దినము దినము
చక్రహస్తుని ప్రకటించు ♦ చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి ♦ గురుడు గురుడు
తండ్రి హరిజేరుమనియెడి ♦ తండ్రి తండ్రి.

సీ. కంజాక్షునకుగాని ♦ కాయంబు కాయమే
పవనకుంభితచర్మ ♦ భస్త్రిగాక
వైకుంఠుబొగడని ♦ వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ♦ ఢక్కగాక
హరిపూజనము లేని ♦ హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత ♦ దర్విగాక
కమలేశుజూడని ♦ కన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములుగాక

ఆ. చక్రిచింతలేని ♦ జన్మంబు జన్మమే
తరళసలిలబుద్బు ♦ దంబుగాక
విష్ణుభక్తిలేని ♦ విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి ♦ పశువుగాక.

సీ. సంసారజీమూత ♦ సంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభం ♦ జనము లేక

తాపత్రయాభీల ♦ దావాగ్నులాఱునే
విష్ణుసేవామృత ♦ వృష్టి లేక
సర్వాంకషాఘౌఘ ♦ జలరాసులింకునే
హరిమనీషాబాడ ♦ బాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధ ♦ కారంబులడఁగునే
పద్మాక్షునుతిరవి ♦ ప్రభలు లేక
తే. నిరుపమానపునరావృత్తి ♦ నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ♦ ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింత నాం ♦ జనము లేక
తామరసగర్భునకునైన ♦ దానవేంద్ర.

భాగవతము—శృంగారము.

శా. శ్రీకంఠా! నినునీవ యేమఱకుమీ ♦ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాగురించుటకునై ♦ నాఁడేనుగైకొన్న శాం
తాకారంబు జగన్నిమజ్జనము నీ ♦ వైచూచెదే జూపెదన్
గైకోనర్హులు మున్ను కాముకులు సం ♦ కల్పప్రభూతాత్మకుల్.

సీ. ఒక యెలదోటలో ♦ నొకవీథి నొకనీడ
గుచకుంభములమీఁది ♦ కొంగుదలఁగ
గబరికాబంధంబు ♦ గంపింపనుదుటిపై
జికురజాలంబులు ♦ సికుక్కవడగ
ననుమానమై మధ్య ♦ మల్లాడ జెక్కుల
గర్ణకుండలకాంతి ♦ గంతులిడగ
నారోహభరమున ♦ నడుగులు దడబడ
దృగ్దీప్తిసంఘంబు ♦ దిశలగప్ప
తే. వామకరమున జాఱిన ♦ వలువబట్టి
కనకనూపురయుగళంబు ♦ గల్లనంగ
గంకణంబుల ఘణఘణ ♦ త్కారమెసగ
బంతిచే నాడు ప్రాయంపు ♦ టింతిగనియె.

శా. ఈకాంతాజన మెవ్వరిదోకో ♦ యీచూడురూపంబు ము
న్నే కల్పంబులయందుగాన మజుఁడీ ♦ యింతిన్ సృజింపంగఁ దా
లేకుం జెల్ల నిజంబువల్లభత నీ ♦ లీలావతిం జేరగా
నేకాంతుండుగలండొ క్రీడలకు నా ♦ కీయింతిసిద్ధించునే.

ఆ. నాలుగంటివాడి ♦ వాలారుజూపుల
శూలిధైర్యమెల్ల ♦ గోలుపోయి
తరలిమెఱుక లేక ♦ మఱచెగుణంబుల
నాలిమఱచె నిజగ ♦ ణాలిమఱచె.

ఆ. ఎగురవైచిపట్ట ♦ నెడలేమిజేదప్పి
వ్రాలుబంతి గొనగ ♦ వచ్చునెడను
బడతివలువ వీడి ♦ పడియె మారుతహతి
జంద్రధరునిమనము ♦ సంచలింప.

మ. రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ ♦ రోమాంచవిభ్రాజితం
గుచభారానిమితం గరద్వయపుటీ ♦ గూఢీకృతాంగిం జల
త్కుచబంధంగని మన్మథాతురత నా ♦ కంపించి శంభుండు ల
జ్జచలింపందనకాంత సూడ గదిసెం ♦ జంద్రాస్యకేల్దమ్మికిన్.

ఆ. పదముసేరవచ్చు ♦ ఫాలాక్షుపొడగని
చీరవీడిపడిన ♦ సిగ్గుతోడ
మగువనగుచు దరుల ♦ మాటునదాగెను
వేల్పుఱేడు నబల ♦ వెంటబడియె.

మ. ప్రబలోద్యత్కరిణింగరీంద్రుడు రమిం ♦ పన్వచ్చు లీలన్ శివుం
డబలా పోకుము పోకవేయనుచుడా ♦ యంబాఱి కెంగేలద
త్కబరీబంధముఁబట్టి సంభ్రమముతో ♦ గౌగిళ్ళనోలార్చెనం
తబహిఃప్రక్రియ నెట్టకేని గదియం ♦ దద్బాహునిర్ముక్తయై

సీ. వీడివెన్నుననాడు ♦ వేణీభరంబుతో
జఘనభారాగత ♦ శ్రాంతితోడ
మాయావధూటియై ♦ మరలిజూచుచుబాఱు
విష్ణుసద్భుతకర్ము ♦ వెంటదగిలి

యీశానుమరల జ ♦ యించెమరుండన
గరిణి వెస్నను కరి ♦ కరణిదాల్చి
కొండలు నేలులు ♦ గొలకులు వనములు
హరుడు దాటిసనంగ ♦ సమ్మహాత్ము

తే. నిర్మలామోఘ రేతంబు ♦ నేలమీద
బడినచోటెల్ల వెండియు ♦ బసిడియయ్యె
ధరణివీర్యంబు వడ దన్ను ♦ దానెఱింగి
దేవమాయాజడత్వంబు ♦ దెలిసెహరుడు.

క. జగదాత్ముండగు శంభుడు
మగిడెను హరితనదు ♦ మాహాత్మ్యమునన్
విగతత్రపుడై నిలచెను
మగువతనంబుడిగి హరియు ♦ మగవాడయ్యెన్.

ఆ. కాముగెలువవచ్చుఁ ♦ గాలారిగావచ్చు
మృత్యుబలముగలిగి ♦ మెఱయవచ్చు
నాడువారిచూపు ♦ టంపఱగెలువంగ
వశముగాదు త్రిపుర ♦ వైరికైన.

సీ. నీపాదకమలంబు ♦ నెమ్మిడగ్గఱగాని
తరలిపోవంగ బా ♦ దములురావు
నీకరాబ్జంబులు ♦ నెఱినంటితివగాని
తక్కనపనికి హ ♦ స్తములుసారవు
నీవాగమృతధార ♦ నిండగ్రోలగగాని
చెప్ప లవ్యభాషలు ♦ సేరివినవు
నీసుందరాకృతి ♦ నియతిజూడగగాని
చూడవన్యంబుల ♦ జూడ్కికవలు

ఆ. నిన్న కాని పలుక ♦ సేరవుమాజిహ్వ
లొల్లననుచుబలుక ♦ నోడవీవు
మామనంబులెల్ల ♦ మరపిదొంగిలితివి
యేమిసేయువార ♦ మింకగృష్ణ.

చ. సిరికినుదారచిహ్నములు ♦ సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర మా తపము ♦ సంపదజేరితి మెట్టకేలకున్
మరలగలేము మామగల ♦ మాటల నొల్లము పద్మగంధముల్
మరిగినతేటులన్యకుసు ♦ మంబులకుం జన నిచ్ఛయించునే.

ఆ. నవతులేక నీవి ♦ శాలవక్షస్థలి
దొలసితోడగూడ ♦ దోయజాక్షి
మనవు మనచునెపుడు ♦ మాకాంత నీపాద
కమలరజము గోరు ♦ గాదె కృష్ణ.

ఉ. అత్తలుమామలున్ వగవ ♦ నాడికకోడకనాథులన్ సుగా
యత్తులజేసి యిల్వరుస ♦ లాలడిబోవగ నీదునవ్వులన్
మెత్తనిమాటలన్ మరుడు ♦ మేల్కని యేచినవచ్చినారమే
పొత్తులమొల్ల మోపురుష ♦ భూషణ! దాస్యము లిచ్చికావవే.

మ. మగువల్ సెక్కరె తొల్లివల్లభులకున్ ♦ మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు దలంపరే తగులముల్ ♦ మాపాల నేపుట్టెనే
మగవా రాడెడుమాటలేతగవు నీ ♦ మాటల్ మనోజాగ్ని చే
బొగులంజాలము కౌగిలింపుము మముం ♦ బుణ్యంబు పుణ్యాత్మకా.

ఉ. కుండలదీప్తిగండమును ♦ కుంచితకుంతలఫాలమున్ సుధా
మంతితపల్లవాధరము ♦ మంజులహాసవిలోకనంబునై
యుండెడి నీముఖంబుగని ♦ యుండగవచ్చునె మన్మథేక్షుకో
దండవిముక్తబాణముల ♦ దాసులమయ్యెద మాదరింపవే.

సీ. నీయధరామృత ♦ నిర్ఝరంబుల నేడు
సేరివా తెరలపై ♦ జిలుకకున్న
నీవిశాలాంచిత ♦ నిర్మలవక్షంబు
కుచకుట్మలంబుల ♦ గూర్పకున్న
నీరమ్యతరహస్త ♦ నీరజాతంబులు
చికురబంధంబుల ♦ జేర్పకున్న
నీకృపాలోకన ♦ నివహంబు మెల్లన
నెమ్మొగంబులమీద ♦ నెఱపకున్న

ఆ. నీనవీనమాన ♦ నీయ సల్లాపంబు
కర్ణరంధ్రదిశల ♦ గప్పుకున్న
నెట్లు బ్రదుకువార ♦ మొందు జేరెదువార
మధిప వినగదగదె ♦ యాదుకొయుబు.

మ. భవదాలోకనహాసగీతజములై ♦ భాసిల్లుకామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచే ♦ బాపందగుంబాపవే
ని వియోగానలహేతిసంహతులచే ♦ నిరైభవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీధి బొందెదము నీ ♦ పాదంబు లాసంబ్రియా.

క. తరుమృగ ఖగగోగణములు
కరమొప్పెడు నిన్నుగన్న ♦ గానము విన్నం
గరగి పులకించునబలలు
గరగరె నిను గన్న నీదు ♦ గానమువిన్నన్.

సీ. ఈపంచబాణాగ్ని ♦ నేవెంటనార్తుము
నీమంజువాగ్వృష్టి ♦ నెగడదేని
నీయున్మథాంభోధి ♦ నేత్రోవ గడతుము
నీదృష్టినావయై ♦ నిలువదేని
నీచిత్తజధ్వాంత ♦ మేజాడ జెఱతుము
నీహాసచంద్రిక ♦ నిగుడదేని
నీదర్పకజ్వర ♦ మేభంగి నడతుము
నీనవాధరసుధ ♦ నింపవేని

ఆ. నెట్లు నిర్వహింతు ♦ మేలాగు మాలాగు
కరుణసేయవేని ♦ గడియవేని
మరుడు నిర్దయుండు ♦ మననిచ్చునే యశో
దాకుమార యువతి ♦ ధైర్యచోర.

సీ. మానినీమన్మథు ♦ యాదవుగానరే
సలలితోదారవ ♦ త్సకములార
సలలితోదారవ ♦ త్సకవైరిగానరే
సుందరోన్నతలతా ♦ ర్జునములార

సుందరోన్నతలతా ♦ ర్జునభంజుగాన రే
ఘనతరలసదశో ♦ కంబులార
ఘనతరలసదశో ♦ కస్ఫూర్తి గాన రే
నవ్యరుచిరకాంచ ♦ నాంబులార

ఆ. నవ్యరుచిరకాంచ ♦ నకిరీటుగాన రే
గహానపదవికురవ ♦ కంబులార
గహానపదవికురవ ♦ కినివాసి గాన రే
గణికలార చారు ♦ గణికలార.

సీ. కొమ్మకు బువ్వులు ♦ గోసినాడిక్కడ
మొనసి పాదాగ్రంబు ♦ మోపినాడు
సతి నెత్తుకొని వేడ్క ♦ జరిగినాడిక్కడ
దృణములో లేదిదె ♦ తెరవజాడ
ప్రియకు ధమ్మిల్లంబు ♦ వెట్టినాడిక్కడ
గూర్చున్న చొప్పిదె ♦ కొమరుమిగుల
నింతికి గెమ్మోవి ♦ యిచ్చినాడిక్కడ
వెలది నిక్కినగతి ♦ విశదమయ్యె

ఆ. సుదతితోడ నీరు ♦ సొచ్చినాడిక్కడ
జొచ్చితా వెడలిన ♦ చోటులమరెఁ
దరుణిఁగాము కేళి ♦ దనిపినాడిక్కడ
ననగి పెనగియున్న ♦ యందమొప్పె.

సీ. ఒకమెలనాగచే ♦ యూదినాడిక్కడ
సరసనున్నవి నాల్గు ♦ చరణములును
నొక నీలవేణితో ♦ నొదిగినాడిక్కడ
మగజాడలోనిదె ♦ మగువజాడ
యొకలేమ ప్రమొక్కిన ♦ నుడివినాడిక్కడ
రమణిప్రమొక్కిన చొప్పు ♦ రమ్యమయ్యె
యొకయింతి కెదురుగా ♦ నొలిసినాడిక్కడ
నన్యోన్యముఖములై ♦ యంఘ్రులొప్పె

ఆ. నొకతెవెంట దగుల ♦ నుండక యేగినా
డడుగుమీఁదదరుణి ♦ యడుగులమరె
నబల లిరుగెలంకు ♦ లందురాదిరిగినా
డారుపదిములున్న ♦ వమ్మయిచట.

—:భాగవతము - వేదాంతము :—

సీ. భూమీశవినవయ్య ♦ పూర్వకాలమునఁ బు
రంజనుండనునొక్క ♦ రాజుగలఁడు
నతనికి విజ్ఞాతుఁ ♦ డనుపేరఁదగిన వి
జ్ఞాతచేష్టితుఁడగు ♦ సఖుఁడు గలఁడు
నాపురంజనుఁడు పు ♦ రాన్వేషియై ధరా
చక్రంబుగలయంగ ♦ సంచరించి
తనకనురూపమై ♦ పెనుపొందు పురమొందు
వీక్షింపఁ జాలక ♦ విమనుడగుచు

తే. గీ. నేపురములుర్విఁ బొడగనె ♦ నాపురములు
గామములఁ గోరు తనకు న ♦ కామములను
బొందుటకు వానిని ననర్హ ♦ ములుగఁ దనమ
నమునఁ దలఁచి యొకానొకి ♦ నాఁడతండు.

వ. చనుచున్న సమయంబున హిమవత్పర్వత దక్షిణసానువులందు.

సీ. వరనవద్వారక ♦ వాటగవాక్షతో
రణదేహళీగోపు ♦ రముల నొప్పి
ప్రాకారయంత్రవ ♦ ప్రప్రతోళీపరి
ఘాట్టాలకోపవ ♦ నాళిఁ దనరి
సౌవర్ణరౌప్యాయ ♦ సఘనశృంగంబుల
రమణీయవివిధగే ♦ హములమించి
రథ్యాసభాచత్వ ♦ రధ్వజక్రీడాయ
తనసుచైత్యాపణ ♦ తతిఁదనర్పి

తే. మరకతస్ఫటికవిదూర ♦ మణివినూత్న
మౌక్తికాయుత ఖచితహ ♦ ర్మ్యములు గలిగి
విద్రుమ ద్రుమవేదుల ♦ వెలయునొక్క
పురముఁ గనె భోగవతికైనఁ ♦ బోలుదాని.

భాగవతము - రౌద్రము.

సీ. పంచాననోద్ధూత ♦ పావకజ్వాలలు
భూనభోంతరమెల్ల ♦ బూరితముగ
దంష్ట్రాంకురాభీల ♦ ధగధగాయితదీప్తి
నసురేంద్ర నేత్రము ♦ లంధములుగ
గంటకసన్నిభో ♦ త్కరకేసరాహతి
నభ్రసంఘము భిన్న ♦ మై చలింపఁ
బ్రళయార్కభచంచలా ♦ ప్రతిమభాస్వరములై
ఖరనఖగోచులు ♦ గ్రమ్ముదేర

తే. సటలు ఝుళిపించి గర్జించి ♦ సంభ్రమించి
దృష్టిసారించి బొమలు బం ♦ ధించి కెరలి
జిహ్వయాడించి లంఘించి ♦ చేతనొడసి
పట్టె నరసింహు డాదితి ♦ పట్టి నధిప.

క. సరకుగొనక లీలాగతి
నురగేంద్రుడు మూషకంబు ♦ నొడిసినభంగిన్
నరకేసరి దనునొడిసిన,
సురవిమతుడు ప్రాణభీతి ♦ సుడివడియె నృపా.

క. సురరాజవైరిలోబడె,
పరిభావితసాధుభక్తి ♦ పటలాంహునకున్
నరసింహునకు నుదంచ
త్ఖరతరజిహ్వునకు నుగ్ర ♦ తరరంహునకున్.

మ. విహగేంద్రుండహిఁ బ్రచ్చుకైవడిమహో♦ద్వృత్తిన్ నృసింహుండుసా
గ్రహుడై యూరువులందు జేర్చినఖ సం ♦ ఘాతంబులన్ వ్రచ్చెదు
స్సహు దంభోళికఠోరదేహు నచలో ♦ త్సాహున్ మహాబాహునిం
ద్రహుతాశాంతకభీకరున్ ఘనకరున్ ♦ దైత్యాన్వయ శ్రీకరున్.

భాగవతము - యుద్ధవర్ణనము

సీ. సమదపుష్పంధయ ♦ ఝుంకారములుగావు
భీషణకుంభీంద్ర ♦ బృంహితములు
వాయునిర్గతపద్మ ♦ వనరేణువులుగావు
తురగరింఖాముఖో ♦ ద్ధూతరజము
లాకీర్ణ జలతరం ♦ గాసారములుగావు
శత్రుధనుర్ముక్త ♦ సాయకములు
కలహంససారస ♦ కాసారములుగావు
దనుజేంద్రసైన్యక ♦ దంబకములు
కమలకహ్లారకుసుమ సం ♦ ఘములుగావు
చటులరిపుశూలఖడ్గాది ♦ సాధనములు
కన్య నీవేలరణరంగ ♦ మనగనేల
వత్తు వేగమ నిలువుము ♦ వలదువలదు.

వ. అనిన ప్రియునకుం బ్రియంబు జనియింప డగ్గఱి.

ఉ. దానవులైన నేమి మరి ♦ దైత్యసమూహములైన నేమి నీ
మానితబాహుదుర్గముల ♦ మాటున నుండగ నేమిశంక నీ
తో నరుదెంతునంచు గర ♦ తోయజముల్ ముకుళించి మ్రొక్కెన
మ్మానిని దన్ను భర్త ♦ బహుమాన పురస్సరదృష్టిజూడగన్.

వ. ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబుల గ్రుచ్చి మురాసురపాశపరివృతంబైన ప్రాగ్జ్యోతిషంబు డగ్గరి.

మ. గదచే పర్వతదుర్గముల్ శకలముల్ ♦ గావించి సత్తేజిత
ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయముల్ ♦ భంజించి చక్రాహతిం
జెదరన్ వాయుజలాగ్ని దుర్గముల ని ♦ శ్శేషంబులంజేసి భీ
ప్రదుఁడై వాలునఁద్రుంచె గృష్ణుఁడు మురప్రచ్ఛన్న పాశంబులన్.

శా. ప్రాకారంబు గదాప్రహారముల ను ♦ త్పాటించియంత్రంబులున్
నాకారాతుల మానసంబులును భి ♦ న్నత్వంబు నొందంగ న

స్తోకాకారుఁడు శౌరి యెత్తెవిలయో ♦ ద్ధూతాభ్రనిర్ఘాతరే
ఖాకారిన్యము బాంచజన్యము విము ♦ క్త ప్రాణిచైతన్యమున్.

మ. బలవంతుండు ధరాసుతుండు గనె సం ♦ భద్రాజబింబోపరి
స్థలశంపాన్వితమేఘమో యనన గే ♦ ంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁగూడి సంగరకథా ♦ లాపంబులం దేలును
జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ గుహనా ♦ చంగున్ రణాభంగునిన్.

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపగ విలోకించి సంభ్రమంబున

శా. వేణిన్ జొల్లెము వెట్టి సంఘటితనీ ♦ వీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి కుచోపరిస్ఫురదురో ♦ జీజాలముల్ పర్వగా
బాణిం బయ్యెద చక్కగాదాటిమి సం ♦ భద్వీర సంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రా ♦ ణేశాగ్రభాగంబునన్.

క. జన్యంబున దనుజులకా, జ్జన్యము లుడుపంగ గోరి ♦ చనుదెంచిన స్త్రా
జన్యవతిజూచి యదురా, జన్యశ్రేష్ఠుండు సరస ♦ సల్లాపములన్.

క. లేమా దనుజల గెలువగ. లేమా నీవేలకడగి ♦ లేచితివిటురా
లేమాను మానవేనా, లేము విల్లందికొనుము ♦ లీలం గేలన్.

క. హరిణాక్షికి హరి యిచ్చెను, సురనికరోల్లాసనమును ♦ శూరకఠోరా
సురసైన్యత్రాసనమును, బరగర్వ నిరాసనమును ♦ బాణాసనమున్.

శా. ఆవిల్లందిబలంబునొంది తదగ ♦ ణ్యానంత తేజోవిశే
షావిర్భూత మహాప్రతాపమున వీ ♦ రాలోకదుర్లోకయై
తావేగన్ సగుణంబుజేసె ధనువున్ ♦ దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణ ♦ క్రీడామహోత్కంఠతోన్.

క. నారి మొరయించె రిపునే, నారింఖణ హేతువైన ♦ నాదమునిగుడన్
నారీమణి జలసంప, న్నారీభాదికము మూర్ఛ ♦ నందన రేంద్రా.

పోతన శృంగారవీర రసముల ప్రకర్షత.

సీ. సౌవర్ణ కంకణ ♦ ఝణఝణానినదంబు
శింజినీరవముతోఁ ♦ జెలిమిసేయఁ

దాటుసమణిగణ ♦ ధగధగద్దీప్తులు
గండమండలరుచి ♦ గప్పికొనగ
శివళతకాపాంగ ♦ ధళధళరోచులు
బాణజాలప్రభా ♦ పటలినడప
శరపాతఘుమఘుమ ♦ శబ్దంబు పరిపంథి
సైనికకలకల ♦ స్వనమునుడుప
వీరశృంగార భయరౌద్ర ♦ విస్మయములు
గలసి భామినియయ్యెనో ♦ కాకయనగ
నవ్వుదోడుగుట దివుచుట ♦ యేయు పెల్ల
నెఱుగరాకుండ ననిసేసె ♦ నిందువదన.

మ. పరుజూచు న్వరుజూచు నొంపసలరిం ♦ పన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో ♦ వీరంబుశృంగారమున్
జరగంగన్నుల గెంపుసొంపుఁబరగం ♦ జండాస్త్రసంకోహమున్
సరసాలోకసమూహము న్నెఱపుచుం ♦ జంద్రాస్య హేలాగతిన్.

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగె బ్ర ♦ త్యాలీఢపాదంబుతో
నలికస్వేదవికీర్ణ కాలకలతో ♦ నాకర్ణికానీతస
ల్లలితజ్యానఖపుంజదీధితులతో ♦ లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్త విశిఖ ♦ వ్రాతాహతారాతియై.

సీ. బొమ్మపెండ్లిండ్లకు ♦ బోనాలనను బాల
రణరంగమున కెట్లు ♦ రాదలంచె
మగవారిఁ గనిసిఁదా ♦ మఱుఁగుఁజేరెడునింతి
పగవారిఁగెల్వ నే ♦ పగిదిఁజూచెఁ
బసిడి యుయ్యెల [illegible] ♦ భయమందుభీరువు
ఖ[illegible]రథ మే ♦ కడిదినెక్కె
సఖులకోలాహల [illegible] [illegible]లోర్వలేకన్య
[illegible] [illegible]ల కె ♦ బ్బంగినోర్చె

నీలకంఠములకు ♦ నృత్యంబుగరపుచు
నలసితలగిపోవు ♦ నలరుబోడి
యేవిధమున నుండె ♦ నెలమి నాలీఢాది
మానములును రిపుల ♦ మానముడప.

సీ. వీణచక్కఁగబట్టు ♦ వెరవెఱుంగనికొమ్మ
బాణాసనంబెట్లు ♦ పట్టనేర్చె
ప్రమాకున దీఁగె గూ ♦ ర్పంగనేరనికొమ్మ
గుణము నేక్రియ ధనుః ♦ కోటిఁగూర్చె
సరవిముత్యముఁగ్రువ్వ ♦ జాలనియబల యే
నిపుణతసంధించె ♦ నిశితశరము
జిలుకకు బద్యంబు ♦ చెప్పనేరనితన్వి
యస్త్రమంత్రములెన్నఁ ♦ డభ్యసించె

జలుకమనిన బెక్కు ♦ పలుకనిముగ్ధయే
గతినొనర్చె సింహ ♦ గర్జనంబు
లనఁగమెరసెద్విజగ ♦ దభిరామగుణధామ
చారుసత్యభామ ♦ సత్యభామ.

శా. జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ ♦ సారంగయూథంబుగా
నావిల్లింద్రశరాసనంబుగ సరో ♦ జాతస్యుండు మేఘంబుగా
దావిద్యుల్లతభంగినింతసురజి ♦ ద్దావాగ్నిమగ్నంబుగా
ప్రావృట్కాలముసేసె బాణచయమం ♦ భశ్శీకరశ్రేణిగాన్.

సీ. రాకేందుబింబమై ♦ రవిబింబమైయొప్పు
నీరజాతేక్షణ ♦ నెమ్మొగంబు
కందర్పకేతువై ♦ ఘనధూమకేతువై
యలరుపూబోడిచే ♦ లాంచలంబు

ఘావజూపరిధమై ♦ క్రొశయారుకాపరిధమై
మెఱయు నాకృష్టమై ♦ మెలఁతచాప
మంబుప్రవాహమై ♦ యనలసందోహమై
తనరారు నింతి సం ♦ దర్శనంబు
హర్షదాయియయి మ ♦ హారోషదాయియై
పరగుము ద్దరాళి ♦ బాణవృష్టి
హరికి నరికిజూడ ♦ నందందశృంగార
పరిరసము లోలి ♦ విస్తరిల్లె.

క. శింపాలతాభ బెడిదపు, టంపరచే ఘోరదాన ♦ వానీకంబున్
పెంపరి సన్నాహంబుల, సొంపరి భూసుతుని వెనుక ♦ జొచ్చెన్ విచ్చెన్.

వ. అయ్యవసరంబున గంససంహారి మనోహారిణిం జూచి సంతో షకారియుం గరుణారసావలోకనప్రసారియు మధురవచనసుధారస విసారియుం దదీయసమర సన్నాహనివారియు నై యిట్లనియె.

క. మగువ మగవారిముందర, మగతనముం జూపరణము ♦ మానుట నీకున్
మగతనము గాదు దనుజులు, మగువల దెసజనరు మగల ♦ మగతౌటహరీ.

క. నరకా ఖండించెద మ
త్కరకాండాసనవిముక్త ♦ ఘనశరముల భీ
కరకాయ నిన్ను సురకి
న్నరకాంతలు సూచి నేఁడు ♦ సంతసమందన్.

వ. అని పలికి హరి నరకాసుర యోధులమీద శతఘ్నియనఁబి వ్యాస్త్రము ప్రయోగించిన నొక్క వరుసను వారందఱు మహావ్యథఁ జెందిరి మరియును.

మ. శరవిచ్ఛిన్న తురంగమై పటుగదా ♦ సంభిన్న మాతంగమై
యురుచక్రాహతవీరమధ్య పదమై ♦ హాస్కంధముఖ్యాంగమై

సురభిశైత్యనిర్మనుదైన్యముఁ బారయుచున్ ♦ శోషించు హైమాస్త్రంబులతో
హార్తినోల నిలువంగలేక పరచెన్ ♦ హాహానినాదంబులన్.

వ. అప్పుడు.

ఆ. వె. మోసి దనుజయోధ ♦ ముఖ్యులు నిగిడించి
శస్త్రసముదయముల ♦ జనవరేణ్య
మురహరుండు వరుస ♦ మాఱేసి కోలల
ఖండితంబు సేసె ♦ గదసమంచు

క. వెన్నుని సత్యను మోచుచు
బదనఖరచంచు ♦ పక్షాహతులన్
భిన్నములు సేసె గరుడుఁడు
పన్నిన గజసముదయమును ♦ బౌరవపుంఖ్యా.

వ. మరియు విహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబు సైరింపఁ జాలక హతశేషంబయిన సైన్యంబు పురంబుసొచ్చుటం జూచి నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్కరించిన తనచేతిశక్తిగొని గరుడునిపైచె నతండును విరులదండ వ్రేటున జలింపని మదోద్దండవేదండంబునుంబోలె విలసిల్లె నయ్యవసరంబున గజారూఢుండయి కలహారంగంబున

మ. సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁడా ♦ చక్రాయుధున్ సైనశూలము చేబట్టినయంతలోన రుచిమా ♦ లాభిన్న గోరాసురో
త్తమచక్రంబగు చేతిచక్రమున దై ♦ త్యధ్వంసి ఖండించె ర
త్నమయోదగ్రవినూత్నకుండల సమే ♦ తంబైన తన్మూర్ధమున్.

శా. ఇల్లాలం గిటియైన కాలమున ము ♦ న్నేనంచు ఘోషింతువా
తల్లీ నిన్నుదలంచియైన నిచటం ♦ దన్నుం గృపం గావదే
చెల్లంబో తల ద్రెంచెనంచు నిలనా ♦ క్షేపించు చందంబునం
ద్రెక్కెంజప్పుడుగాఁగ భూమిసుతుడు ♦ దీప్తాహవక్షోణిపై.

క. కంటిమి నరకుఁడు పడఁగా
మంటిమి నేఁడనుచు వేసవ ♦ మర్త్యులు మునులున్
మింటం బువ్వులు గురియుచు
బంటింపక పొగడి రోలి ♦ బద్మదళాక్షున్.

భాగవతము-అద్భుతరసము

శా. ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దా ♦ నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున క ♦ ల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై ♦ నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్ర ♦ హ్మాండాంతసంవర్ధియై.

మ. రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛ ♦ త్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై ♦ సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలినుదం ♦ చద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా ♦ బ్రహ్మాండమున్నిండుచోఁ.

భాగవతము-రెండర్థముల పద్యములు

సీ. ఇదినాకు నెలవని ♦ యేరీతిఁ బలుకుదు
నొకచోటనక యెందు ♦ నుండనేర్తు
నెవ్వని వాఁడనం ♦ చేమని పలుకుదు
నాయంతవాఁడనై ♦ నడవనేర్తు
నీనడవడి యని ♦ యెట్లు వక్కాణింతు
బూనిముప్పోకలఁ ♦ బోవనేర్తు
నది నేర్తు నిది నేర్తు ♦ నని యేల చెప్పంగ
నేరుపులన్నియు ♦ నేన నేర్తు
నొరులుగారు నాకు ♦ నొరులకు నేనాదు
నొంటివాఁడ జుట్ట ♦ మొకఁడు లేఁడు

సిరియు వోల్లిగలుగ ♦ చెప్పెదనా యెంకి
సుజనులందు దరచు ♦ సాచ్చియుండ.

సీ. మాసరివాడవా ♦ మాపాపగొనిపోవ
నేపాటి గలవాడ ♦ వేదివంశ
మెంచ జన్మించితి ♦ వెక్కడ బెగితి
వెయ్యాది వడివడి ♦ యెవ్వ రెఱుగు
మానహీనుండవు ♦ మర్యాద లెఱుగవు
మాయుగ్గి కొని కాని ♦ మలయరాన్న
నిరయాపమున శత్రు ♦ నివహాంబుపైబోవు
వసుధేశుడవుగావు ♦ వాపి లేదు
కొమ్ము నిమ్మా సీవు ♦ గుణరహితుండవు
విడువు విడువవేని ♦ విలయకాల
శిఖిశిఖాసమాన ♦ శిఖిశిలీముఖముల
గర్వమెల్ల గొందు ♦ గలహమందు.

సంపూర్ణము.



రాజమహేంద్రవరము: శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాలయందు ముద్రితము.

# వైద్యగ్రంథములు.

| | రు | అ |
|---|---|---|
| శార్ఙ్గధరసంహిత | 8 | 0 |
| వస్తుగుణప్రకాశిక | | |
| వీ॥ వా॥ శాస్త్రిగారు | 5 | 0 |
| సర్వమూలికాయోగమంజరి | 6 | 0 |
| అనుభవదీపిక శి॥ కృ॥ | 1 | 0 |
| భస్మప్రకాశిక డిటో | 1 | 0 |
| ఆంధ్రభైషజ్యరత్నావళి డిటో | 2 | 0 |
| ఆయుర్వేదౌషధరత్నాకరము డిటో | 3 | 0 |
| బసవరాజీయము | 7 | 0 |
| ఆంగ్లేయవైద్యచింతామణి | 5 | 0 |
| సిద్ధమూలికారహస్యము | 1 | 0 |
| పులిప్పాణివైద్యము | 1 | 8 |
| యునానివైద్యామృతం | 0 | 8 |
| మసూరిరోగనివారిణి | 0 | 12 |
| గృహవైద్యం 1 భా॥ | 0 | 12 |
| డిటో 2 భా॥ | 0 | 12 |
| ఆయుర్వేదవైద్యామృతము | 0 | 12 |
| సుఖరోగచికిత్సలు | 0 | 8 |
| విషవైద్యము | 0 | 8 |
| రసప్రదీపిక | 0 | 10 |
| సద్వైద్యజీవనం | 0 | 8 |
| వైద్యశతశ్లోకములు | 0 | 12 |
| బంగారుయోగములు | 0 | 4 |
| 8 నాడులు గల్గిన పుస్తకం | 0 | 12 |
| గోసాయిచిటికెలు పెద్దది | 0 | 4 |
| బైరాగిచిటికెలు డిటో | 0 | 4 |
| నాడీపరిజ్ఞానం | 0 | 8 |
| నలభీమపాకశాస్త్రము | 0 | 8 |
| మిలటరీపాకశాస్త్రము | 0 | 8 |
| వస్తుగుణప్రదర్శిని 300 పే॥ | 1 | 8 |
| ధన్వంతరీవిజయం | 0 | 10 |
| స్త్రీజనకల్పతరువు | 1 | 0 |
| దంతవైద్యము | 0 | 8 |
| అశ్వలక్షణసారం | 0 | 8 |
| మర్బత్తుపాకావళి | 0 | 8 |
| చికిత్సారత్నం గ్లేజు | 1 | 0 |
| వైద్యరహస్యచింతామణి 1 భా॥ | 0 | 12 |
| డిటో 2 భా॥ | 0 | 12 |
| శతలేహ్యపాకావళి | 3 | 8 |
| నేత్రదర్పణం | 0 | 8 |
| బాలగ్రహచికిత్సలు | 0 | 4 |
| డిటో చిన్నసైజు | 0 | 1 |
| అనుపానమంజరి | 0 | 8 |
| సహదేవపశువైద్యము | 0 | 4 |
| స్త్రీణాంచికిత్సలు | 0 | 8 |
| భస్మప్రదీపిక | 0 | 14 |
| నాడీనక్షత్రమాల | 0 | 6 |
| అనుభవవైద్యము 1, 4 భా॥ | 3 | 8 |
| డిటో 5, 8 భా॥ | 2 | 8 |
| అనుభవగృహవైద్యము | 1 | 0 |
| అగస్త్యపరీక్షము | 2 | 0 |
| అజీర్ణము | 0 | 8 |
| వైద్యాభిధానము | 0 | 8 |
| వైద్యామృతము | 1 | 4 |
| వస్తుగుణప్రదీపిక | 3 | 0 |
| వశిష్ఠపరీక్షము (పులిప్పాణి) | 1 | 8 |
| వాజీకరణకల్పద్రుమము | 1 | 8 |
| వ్యాసపరీక్షము | 1 | 8 |
| విషవైద్యచింతామణి | 2 | 0 |
| ప్రసిద్ధాంగ్లేయఔషధయోగం | 1 | 0 |
| సర్పశాస్త్రము | 0 | 8 |
| సన్నిపాతజ్వరము | 1 | 0 |
| సర్వార్థసంగ్రహము | 2 | 0 |
| సర్వౌషధగుణకల్పము | 8 | 0 |